# కాఫీ, టీ... లేదా రస్న?

నాన్నగారు ఆరు గంటలకే ఇంటి కొచ్చినప్పుడు అమ్మ ఆయనకిచ్చేది కాఫీ కాదు... టీ కూడా కాదు... రస్న! ఇంకా






హమ్మయ్య, వేసవి వచ్చేసింది.

ఏమిటో ఊహించండి? తాతయ్య, నాయనమ్మ వేసవికాలంలో కాఫీ మగ్‌లు, టీ మగ్‌లూ వాడరు. ఎందుకంటే, వేసవి సమయం రస్న సమయం.

ఆరెంజ్ □ పైనాపిల్ □ లైమ్ □ షాహీ గులాబ్ □ కాలా ఖట్టా □ కూల్ ఖస్ □ కేసర్ ఇలైచి □ మసాలా సోడా (జల్ జీరా) □ టూటీ ఫ్రూటీ □ మేంగో రిప్ □ గ్రేప్ గ్లో

## తాజాదనం చిందించే రస్న

11 పసందైన రుచులు సరసమైన ధరలో.



రస్న, నాన్నగారు, అన్నయ్య, నేను.



మా ఆనందమయ మైన రస్న కుటుంబం.

Mudra:AEAMR:5160 Tel.

# In a class of its own

*Exclusive pencils for one and all,*




LION **PREMIER®** HB PENCILS

Sleek, Elegant, meant for executives and others, who like style A consistent dark tone for effortless writing - micronized lead for unbreakable points are what adds to its superiority.






LION **PINKY®** PENCILS

Lion 'PINKY' Pencils Pretty Perfect, Ideal for children because of its pretty designs & colours.Strongly bonded lead for unbreakable points and super smooth writing add to its attraction.






LION **Geematic®** DRAWING PENCILS

Lion Geematic Drawing Pencils. A unit for all Professionals like artists, architects, designers & engineers. Give expertise an edge. Available in 14 grades from H to 6H and B to 6B HB and F





**LION PENCILS LTD**
95, Parijat, Marine Drive
BOMBAY 400 002

National-356

# కాస్తంత ముందాలోచన, కొండంత వాత్సల్యం...

## చూపారంటే చాలు. కొద్దిపాటి పొదుపుతోనే 21 ఏళ్ల వయసుకల్లా మీ బిడ్డను లక్షాధికారిని చేయవచ్చు!

# యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధిలో పెట్టుబడి పెట్టండి.

మీ బిడ్డ ఇవాళ్టికి పసి పాప. మీరు ఉన్నారంటే చాలు తన ఆలనకు, పాలనకు లోటుండదు. అయితే అదిగో యిదిగో అనేలోగానే రోజులు గడిచి పోతాయి. తను పెరిగి పెద్దై బయటి ప్రపంచంలోకి అడుగు పెట్టవలసిన సమయం వస్తుంది. జీవిత పోరాటంలో కఠిన సత్యాలను ఎదుర్కోవలసి వస్తుంది.

మరి మీ బిడ్డ భవిష్యత్తు కోసం ఇప్పుడే ఎందుకు ముందాలోచన చెయ్యరాదు! అందుకే, యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధి (CGGF) లో పెట్టుబడి పెట్టండి. ఈ పథకంలో కొంత కాలం పాటు కొద్దిపాటి మొత్తాలు జమ చేయడం ద్వారా, 21 ఏళ్ల వయసుకల్లా మీ బిడ్డను లక్షాధికారిని చేయవచ్చు.

ప్ర. మీ బిడ్డను లక్షాధికారిని చేయాలంటే ఎలా పెట్టుబడి పెట్టాలి?
జ. మీ బిడ్డ పుట్టగానే ఈ CGGF పథకంలో పెట్టుబడి పెట్టదలిస్తే ఈ క్రింది పద్ధతులలో ఏదైనా ఎంచుకోవచ్చు. (i) ఏటా రు. 1,100 చొప్పున 15 ఏళ్లపాటు జమ చెయ్యవచ్చు. (ii) వరుసగా 3 ఏళ్లపాటు రు. 3,200 జమ చెయ్యవచ్చు. లేదా వరుసగా 6 ఏళ్లపాటు రు. 1,900 జమ చెయ్యవచ్చు. (iii) ఒకేసారిగా రు. 8,500 పెట్టుబడి పెట్టవచ్చు.

ప్ర. బిడ్డ కాస్త పెద్ద ఉంటే ఎలా చేయాలి?
జ. 15 ఏళ్ల వరకు ఏ వయసువారైనా అనువైన పథకాలున్నాయి. CGGF కరపత్రంలో ఆ వివరాలన్నీ ఇవ్వబడ్డాయి. ఆ కరపత్రం కోసం వ్రాయండి.

ప్ర. ఈ పథకంలో బిడ్డకు ఎవరెవరు కానుక ఇవ్వవచ్చు?
జ. తల్లిదండ్రులు, బంధువులు, స్నేహితులు, కంపెనీలు, కార్పొరేట్ సంస్థలు.

ప్ర. కనీసం ఎంత సొమ్ము పెట్టుబడి పెట్టాలి?
జ. రు. 500, ఆ పైన రు. 100 గుణింపు మొత్తాలు.

ప్ర. ఈ పెట్టుబడి పైన రాబడి ఎంతుంటుంది?
జ. సం. కి 12.5% చొప్పున, అందుకు తోడుగా 5 ఏళ్ల కొకసారి బోనస్ డివిడెండు.

ప్ర. గడువు పూర్తయిన తర్వాత మరేదైనా సౌకర్యం ఉందా?
జ. సొమ్ము వాపసు తీసుకునే బదులు మీ బిడ్డ తనకు రావలసిన సొమ్మును (నెలనెలా రాబడి కోసం) సమీపంలోని నెలసరి రాబడి యూనిట్ పథకంలో గానీ, లేదా మరే యితర యూనిట్ ట్రస్ట్ పథకంలో గానీ పెట్టుబడి పెట్టవచ్చు.

బాలల కానుక వృద్ధి నిధి (CGGF) గురించిన ఉచిత సమాచారానికై ఏ యూనిట్ ట్రస్ట్ కార్యాలయం వద్దగానీ, ముఖ్య ప్రతినిధి లేదా ఏజెంటు వద్దగానీ, [illegible] సూపర్ మార్కెట్ లేదా ఎన్నిక హిందుస్థాన్ పెట్రోలియం పెట్రోలు పంపుల వద్దగానీ ఇండియన్ ఆయిల్ పెట్రోలు పంపుల వద్దగానీ సంప్రదించండి.

లేదా అధిక వివరాలకై ఈ కూపన్‌ను ఏ యూనిట్ ట్రస్ట్ కార్యాలయానికైనా పోస్టు చేయండి.

దయచేసి నాకు CGGF గురించిన ఉచిత సమాచారాన్ని పంపండి
పేరు : ______________________
చిరునామా : ______________________



యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా
(ప్రభుత్వ రంగంలో ఒక ఆర్థిక సంస్థ)

• 13, సర్ విఠల్‌దాస్ థాకర్సీ మార్గ్ (న్యూ మెరీన్ లైన్స్) బొంబాయి-400 020 ఫోన్: 2863767/620 1995

• జస్టిస్ బషీర్ అహ్మద్ సయ్యద్ బిల్డింగ్, 45, సెకండ్ లైన్ బీచ్, మద్రాసు-600 001 ఫోన్: 587433/580938

• 203/204, మొఘల్ కోర్ట్ కాంప్లెక్స్ సెకండ్ ఫ్లోర్, బషీర్ బాగ్, హైదరాబాదు-500 001. ఫోన్: 240030.

• డోర్ నం. 29-3-12, వెంకటేశ్వర రావు స్ట్రీట్, ఆప్కో భవన్ వద్ద, రహమాన్ పార్కుకు పడమట, గవర్నరు పేట, విజయవాడ-520 002. ఫోన్: 63964.

Sista's-UTI-29/90 TEL G




లాస్ ఆఫ్ ది జంగిల్ గేమ్

స్నేక్
సఫారి గేమ్

# మేగీ క్లబ్: రండి, అడవుల్లో సరదా విహారానికి!




## ఉచితం!



మీ బహుమతులను పొందండి

మీరు మేగీ నూడుల్స్ యొక్క అయిదు ఖాళీ సంచులకు ముందు వైపున

ముద్రించబడి ఉండే యీ [MAGGI 2-minute] ను కత్తిరించి, మీరు ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం వాటిని మాకు పంపించండి. అంతే! మీకు 6 నుంచి 8 వారాలలో మేగీ క్లబ్ నుంచి ఎంతో వినోదాన్నీ, ఉత్సాహాన్నీ కలిగించే బహుమతి అందుతుంది!

మర్చిపోకండి:

మీరు మేగీ క్లబ్ సభ్యులు కాని పక్షంలో, మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతి పేరుతోబాటు మీ పేరు, చిరునామా పంపించండి. మీరు మేగీ క్లబ్ సభ్యులై ఉంటే, మీ సభ్యత్వపు నంబరు పంపించండి.

డిస్నీ టుడే, కామిక్



ఫారెస్ట్ ఫేసెస్ కేప్ మరియు మాస్క్




మా చిరునామా:

మేగీ క్లబ్ పి.ఒ. బాక్స్ 5788, న్యూ ఢిల్లీ:110055

జంగిల్ స్టాండీస్ సెట్

మరొక సదుపాయం కూడా:

మీరు యింతవరకు ట్రావెల్ ఇండియా గేమ్ యింకా సేకరించి ఉండకపోతే, యిప్పుడు సేకరించండి!



డాల్టన్
ప్రచురణల నుండి
మీరు ఎదురు చూస్తున్న
**వారపత్రిక**
విభిన్న తరహాలో
తెలుగులో మున్నెన్నడూ
ఏ వారపత్రికా వెలువడని
వైవిధ్యమైన రీతిలో
వుంటుంది.
**వారపత్రిక**
గురించి పూర్తి వివరాలు
వచ్చేసంచికలో...

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'　　సంచాలకుడు : నాగిరెడ్డి


## ఇంకిపోతూన్న మహాసముద్రం!

ప్రపంచంలోని పెద్ద సముద్రాలలో ఆరవదయిన ఒక మహాసముద్రం మరొక ఇరవై సంవత్సరాలలో అంటే—2010వ సం॥నాటికి పూర్తిగా ఇంకిపోతుందని ఎవరయినా అంటే నమ్మగలరా ? నమ్మినా నమ్మకపోయినా, ఇది నిజం! ఎందుకంటే, ఇప్పటికే సోవియట్ రష్యాలోని ఆరల్ సముద్రంలో మూడువంతుల జలాలు ఇంకిపోయాయి. ఈ సముద్రజలాలు ముప్పై సంవత్సరాలలో బురదగా, ఇసుకగా ఎలా మారిపోయాయి ?

ఈ సముద్రంలో ముఖ్యంగా అముదార్యా, సిర్‌దార్యా అనే నదులు కలిసేవి. ఈ నదుల జలాలను పంటలకు ఉపయోగించుకోవాలన్న ఉద్దేశంతో, నదుల దిశను మళ్ళించి, మధ్య ఆసియాలోని ఎడారి భూములకు తీసుకుపోయారు. దీనివల్ల సముద్రమే ఇంకిపోయే అపాయం రాగలదని అప్పుడు ఎవరూ ఊహించలేకపోయారు! ఇప్పుడు ఆ మధ్య ఆసియా ప్రాంతమంతా ప్రత్తిపంటమీదే ఆధారపడి వుండడంవల్ల నదీజలాలను ఆపడానికి సాధ్యపడదు!

ప్రస్తుతం రష్యాలో ఏర్పడిన నూతన అభ్యుదయ నాయకత్వం, ప్రపంచ నిపుణుల సహాయంతోనైనా, ఆరల్ సముద్రం ఇంకిపోకుండా తగిన చర్యలు తీసుకోగలదని విశ్వసిస్తున్నాము.

ఇంకిపోతూన్న ఆరల్ సముద్రం ప్రపంచానికి ఒక హెచ్చరిక వంటిది. ప్రకృతికి విరుద్ధమైన కార్యాలకు పూనుకునేటప్పుడు మనమెంతో జాగ్రత్తగా వ్యవహరించాలి!


సంపుటి 86　　మే '90　　సంచిక 5

విడి ప్రతి : 3-00　　: :　　సంవత్సర చందా : 36-00






**FIRE ENGINE**



**SUPER DUMPER**

# INTRODUCING

The Sammo range of mechanical toys. Every toy made to exacting standards set by our collaborators — Sammo Corporation of S.Korea, one of the leading toy manufacturers in the world.

Toys crafted to look like the real thing. With dynamic crackling sounds. Glossy, non-fading colours. Exciting colourful packaging which prevents damage and shop soiling.

Smooth edges and non-toxic colours ensure the child's safety.

Indeed, these are toys children will love playing with, toys which parents will love to buy for them.



**WRECKER**



**ZAP GUN**




Watch out for more additions to the Sammo Collection

**CHANDAMAMA TOYTRONIX**

**Chandamama Toytronix Pvt Ltd,**
Chandamama Buildings, 188, NSK Salai,
Vadapalani, Madras - 600 026.
Tel: 423423 Telex: 041-25047 DOT IN

# కాశ్మీరు సమస్య—నిజానిజాలు




కశ్యపముని పేరు మీదుగానే (కశ్యప్ + మీర్) కాశ్మీరు ఏర్పడిందని మన పురాణాలు పేర్కొంటున్నాయి.

ప్రాచీనకాలంలో భారతదేశం అనేక చిన్నచిన్న రాజ్యాలుగా వుండేది. వాటిని రాజులు పరిపాలించేవారు. అయినా ఆ

రాజ్యాలన్నీ భారతదేశం (భరతవర్షం)లో అంతర్భాగాలుగానే భావించబడేవి!

భారత స్వాతంత్ర్య పోరాట ఆఖరి సంవత్సరాలలో, మహమ్మదాలీ జిన్నా నాయకత్వంలోని ముస్లింలీగ్—ముస్లింలకు ప్రత్యేకంగా సర్వతంత్ర స్వతంత్ర దేశం కావాలని కోరింది. ఈ విషయంలో నాటి పాలకులయిన కొందరు అంగ్లేయులు, జిన్నాను పురికొల్పారన్న సంగతి అందరికీ తెలిసినదే. మత ప్రాతిపదికపై దేశాన్ని విభజించడం భావ్యం కాదని నాటి ముస్లిం నాయకులే పలువురు భావించారు. అయినా, జిన్నా పట్టుదల కారణంగా, భారతదేశం నుంచి పాకిస్థాన్ విభజన అనివార్యమయింది.

అనాడు జమ్మూ, కాశ్మీర్‌ను పరిపాలించిన మహారాజా సర్ హరిసింగ్, ఎటు చేరడమా అని ఆలోచిస్తున్నప్పుడే, పాకిస్థాన్, చాలామంది కొండజాతివారిని కాశ్మీర్ దురాక్రమణకు ఉసికొలిపింది. కాశ్మీర్‌లో అధిక సంఖ్యాకులయిన ముస్లింల, నాయకుడయిన షేక్ అబ్దుల్లా సలహాప్రకారం, మహారాజా హరిసింగ్ కాశ్మీర్‌ను భారతదేశంతో కలపడానికి నిర్ణయించాడు. ఆ తరవాత భారత ప్రభుత్వం తన సేనలను పంపి, దురాక్రమణ దారులను తరుమగొట్టింది. అయితే, అసరికే, దురాక్రమణదారులు కాశ్మీర్‌లో కొంత భూభాగాన్ని వశపరచుకున్నారు. భారతదేశం అప్పుడే స్వతంత్రం పొందడంవల్ల, దురాక్రమణదారులను ఆక్రమిత ప్రాంతాలనుంచి తరుమ గొట్టడానికి రక్తపాతానికి దారితీసే యుద్ధానికి సుముఖత చూపలేదు. ఈ విషయాన్ని, ఐక్యరాజ్యసమితి, భద్రతాసమితి నిర్ణయానికి పంపింది!

ఈ ఆక్రమిత ప్రాంతానికి పాకిస్థాన్, 'అజాద్ కాశ్మీర్' అని పేరు పెట్టింది. కాశ్మీర్ ప్రజలలా కాకుండా, ఇక్కడి ప్రజలు పేదరికంతోనూ, అవిద్యతోనూ నికృష్టజీవితాలు గడుపుతున్నారు!

మత ప్రాతిపదికపై ఒక దేశాన్ని ఏర్పరచడం అర్థరహితమని తేలిపోయింది. బంగ్లాదేశ్ ప్రజలందరూ ముస్లింలే. అయినా, వాళ్ళు పాకిస్థాన్ నుంచి విడిపోయారు. పాకిస్థాన్‌కన్నా మనదేశంలోనే ఎక్కువమంది ముస్లింలు వున్నారు! అయినా, కొందరు ఈ ప్రత్యక్ష సత్యాన్ని చూడడం లేదు. ఇంకా కొంతమంది, కాశ్మీర్ ప్రజలలో లేనిపోని ఆశలు రేకెత్తిస్తూ, వ్యక్తుల అపహరణలూ, హత్యలూ చేసే ఉగ్రవాదులకూ, విచ్ఛిన్నకర శక్తులకూ శిక్షణనిస్తూ, ప్రోత్సాహిస్తూ అరాచక పరిస్థితులు సృష్టించడానికి శాయశక్తులా కృషి చేస్తున్నారు.

ఈ కారణంగా ఈనాడు కాశ్మీర్ తీవ్రమైన సమస్యలను ఎదుర్కొవలసి వస్తున్నది!



# ఇద్దరన్నదమ్ములు

సుమపురి రాజు కీర్తిసేనుడు మహావీరుడు. శాంతికాముడు. అతని ధర్మ పరిపాలనలో ప్రజలు ఏ లోటూ లేకుండా సుఖసంతోషాలతో కాలం గడిపారు. అతడి భార్య ప్రియంవదకు చాలా కాలంవరకూ సంతానం కలగలేదు. ఆమె ఎన్నో నోములూ, పూజలూ చేసింది. అయినా ఆమె కోరిక తీరలేదు.

చివరకు రాణి బలవంతం మీద, కీర్తిసేనుడు, స్వయంప్రభ అనే రాజకుమార్తెను వివాహం ఆడాడు. కొంతకాలం తర్వాత స్వయంప్రభ, ఒక మగబిడ్డను కన్నది. రాజు పరమానందం చెంది, ఆ బిడ్డకు విజయసేనుడని పేరు పెట్టాడు. అయితే, ఇది జరిగిన కొన్నాళ్ళకు పెద్ద రాణి ప్రియంవద కూడా ఒక మగపిల్లవాణ్ణి కన్నది. రాజు అతడికి ఆదిత్యసేనుడు అని నామకరణం చేశాడు.

క్రమంగా విజయసేనుడూ, ఆదిత్యసేనుడూ పెరిగి పెద్దవారై, గురుకులంలోని రాజగురువు దగ్గర సకలవిద్యలూ అభ్యసించారు. ముఖ్యంగా క్షాత్రవిద్యలలో ఇరువురూ అద్వితీయమైన ప్రతిభను సాధించారు. విద్యాభ్యాసం ముగించుకుని వచ్చిన కుమారులను చూసి, రాజు కీర్తిసేనుడు చాలా గర్వపడ్డాడు.

అయితే, ఆసరికి బాగా వృద్ధుడైపోయిన కీర్తిసేనుడికి, ఒక సమస్య ఎదురైంది. అదేమిటంటే—రాజ్యాచారం ప్రకారం పెద్ద భార్య కుమారుడికి పట్టాభిషేకం చేయాలి. కాని ఆమె కుమారుడైన ఆదిత్యసేనుడు, చిన్న భార్య కొడుకైన విజయసేనుడి కంటే వయసులో చిన్నవాడు!

రాజు ఏమిచేయడమా అని తీవ్రాలోచనలో వుండగా, పక్కనే వున్న హిమగిరి

ఎన్. శివనాగేశ్వరరావు



రాజు సహస్రాక్షుడు సుమపురి మీదికి దండెత్తాడు. సహస్రాక్షుడు అమిత బలశాలి. వృద్ధుడైన కీర్తిసేనుడు యుద్ధం చేయగల స్థితిలో లేడు. అతడి కుమారులిద్దరూ శక్తిమంతులూ, శౌర్యంకలవారే కాని అనుభవశూన్యులు. అటువంటి వారిని యుద్ధరంగానికి పంపడం మేలవుతుందా?

సహస్రాక్షుడి దాడిని గురించి తెలుసుకున్న విజయసేనుడూ, ఆదిత్యసేనుడూ, అతణ్ణి యుద్ధంలో ఓడించి తమ వీరత్వాన్ని చాటాలని ఉవ్విళ్ళూరారు.

రాజు కీర్తిసేనుడు వాళ్ళతో, "నాయనలారా! మన శత్రువైన సహస్రాక్షుడు అమితబలశాలి. అతణ్ణి ఓడించడం అంత తేలికకాదు," అన్నాడు.

అందుకు విజయసేనుడు, "నాన్నగారూ, మీరు మాకు పిరికిమందు పోస్తున్నారు!" అన్నాడు.

"విజయమో, వీరస్వర్గమో తేల్చుకోనీయండి!" అన్నాడు ఆదిత్యసేనుడు ఉత్సాహంగా.

అందుకు రాజు కీర్తిసేనుడు, "కొన్ని సమస్యల్ని పరిష్కరించడానికి కండబలం ఒక్కటే చాలదు. బుద్ధిబలం కూడా కావాలి. ఏం చేయాలో శాంతంగా ఆలోచిద్దాం," అన్నాడు.

ఆ సాయంత్రం కీర్తిసేనుడు, తన కుమారులతో యుద్ధవ్యూహం గురించి మాట్లాడుతూండగా, ఒక సేవకుడు వచ్చి, "మహారాజా, మంత్రపాలుడు అనే పండితుడు, తమ దర్శనార్థం వచ్చాడు," అని చెప్పాడు.

కీర్తిసేనుడు అయన్ని పంపవలసిందిగా సేవకుడికి ఆదేశించాడు. మంత్రపాలుడు వస్తూనే, విజయసేనుణ్ణీ, ఆదిత్యసేనుణ్ణీ ఒకసారి పరీక్షగా చూసి, "విజయోస్తు!" అని ఆశీర్వదించాడు.

అయన ఆశీర్వాదం విన్న రాజు కీర్తిసేనుడు, "పండితోత్తమా! బలవంతుడైన శత్రువుతో యుద్ధం ఆసన్నమైన ఈ సమ

యంలో, మీ ఆశీర్వచనం మాకెంతో ధైర్యం కలిగిస్తున్నది," అన్నాడు.

అప్పుడు మంత్రపాలుడు, "మహారాజా, నాకు శక్తిరూపిణి అనే మంత్రం తెలుసు. దాని సాయంతో ఒక వ్యక్తికి గల శక్తిని, మరొక వ్యక్తిలో ప్రవేశపెట్టగలను. అందు వలన, ఆ రెండో వ్యక్తి అమితబలశాలి అవుతాడు. అయితే, ఆ విధంగా శక్తిని మరొకరిలో ప్రవేశపెట్టడానికి, మొదటి వ్యక్తి అనుమతించాలి. అంతేకాక, ఆ ఇద్దరూ రక్తసంబంధం కలవారై వుండాలి. కార్యం సాధించాక రెండో వ్యక్తిలో ప్రవేశపెట్టిన శక్తిని, మొదటి వ్యక్తికి తిరిగి యివ్వవచ్చు. అద్భుతమైన నా ఈ విద్య సాయంతో, మీకు యుద్ధంలో తప్పక విజయం సిద్ధించగలదు," అని చెప్పాడు.

కీర్తిసేనుడు, మంత్రపాలుణ్ణి, "పండితోత్తమా! మీ అభిప్రాయం మరికొంత వివరంగా సెలవీయండి," అని కోరాడు.

అందుకు మంత్రపాలుడు, "యుద్ధంలో నీ కుమారులిద్దరూ ఒకేసారి సహస్రాక్షుణ్ణి ఎదిరించిపోరడం క్షాత్రధర్మం అనిపించుకోదుగదా! అయితే, ఎవరో ఒకరు అతడి మీద కత్తిదూసి జయించడం కల్ల. నా శక్తి రూపిణి మంత్రసాయంతో, నీ యిద్దరు కుమారులలో ఒకరి శక్తికి మరొకరి శక్తిని



కూడా కలిపితే, అతడు సహస్రాక్షుడితో పోరాడి విజయం సాధించగలడు. అప్పుడు అతడి శౌర్యాన్ని అందరూ అభినందించడమే కాక, మీ రాజ్యప్రతిష్ఠ కూడా ఇనుమడిస్తుంది," అన్నాడు.

"పండితోత్తమా! మీ ఆలోచన అత్యద్భుతంగా వున్నది. అలాగే చేద్దాం," అన్నాడు రాజు కీర్తిసేనుడు.

అయితే, అందుకు ఆదిత్యసేనుడు ఒప్పుకోక, "ఈ చేయబోయేది మోసం అనిపించుకుంటుంది. వీరుడెన్నడూ మోసంతో గెలవాలని భావించడు. విజయసేనుడి శక్తిని కూడా తీసుకుని సహస్రాక్షుణ్ణి జయించడం, నాకిష్టం లేదు. అలా



చేయగా వచ్చే కీర్తిప్రతిష్ఠలు, నాకు సంతోషం కలిగించలేవు!'' అన్నాడు తీవ్రస్వరంతో.

దానికి విజయసేనుడు శాంతంగా, ''ఆదిత్యా, నీ అభిప్రాయం పొరబాటు. మనం చేయబోయేది మోసమేమీ కాదు, రాజనీతి! రాజ్యసంరక్షణ మన ప్రథమ బాధ్యత. అందుకు మనం ఏమి చేసినా ధర్మమే అవుతుంది,'' అన్నాడు.

''అయితే, విజయా! తమ్ముడు తన శక్తి నివ్వడానికి అంగీకరిస్తే, ఒంటరిగా సహస్రాక్షుడితో యుద్ధం చేయడానికి నువ్వు సిద్ధమేనా?'' అని రాజు కీర్తిసేనుడు అడిగాడు.

విజయసేనుడు సరే అన్న మీదట, ఆదిత్యసేనుడు, ''వీరుడు ప్రాణత్యాగాని కైనా వెనుదీయడుగాని, శక్తిహీనుడుగా మారడానికి సమ్మతించడు. సహస్రాక్షుణ్ణి ఓడించడానికి, ఇంకేదైనా ఉపాయం ఆలోచిద్దాం,'' అన్నాడు.

తండ్రీకొడుకుల సంభాషణ వింటున్న మంత్రపాలుడు కల్పించుకుని, ''వాదోపవాదాలకు ఇది సమయం కాదు. ఒక పని చేయండి. మీలో ఒకరు మీ శక్తిని, మీ తండ్రిగారికి యివ్వండి. ఆయనే శత్రువుతో యుద్ధం చేసి విజయం సాధిస్తాడు,'' అన్నాడు.

విజయసేనుడు అందుకు కూడా, తన సమ్మతిని తెలియజేశాడు. అయితే, ఆదిత్యసేనుడు ఆ పద్ధతికి అంగీకరించక, తన శక్తిని విజయసేనుడి కివ్వడానికీ, అతన్నే యుద్ధరంగానికి పంపడానికీ సమ్మతించాడు. కాని, ఇందుకు ముందుగా ఒకసారి ఏకాంతంలో, మంత్రపాలుడితో మాట్లాడాలని కోరాడు.

మంత్రపాలుడు, ఆదిత్యసేనుడితో ఏకాంతంగా మాట్లాడిన తర్వాత, తన మంత్రప్రభావంతో ఆదిత్యసేనుడి శక్తిని, విజయసేనుడిలో ప్రవేశపెట్టాడు.

తర్వాత విజయసేనుడు సైనికబలంతో యుద్ధరంగానికి వెళ్ళి, సహస్రాక్షుడితో

ద్వంద్వయుద్ధం చేసి ఘనవిజయం సాధించాడు.

విజయసేనుడు నగరానికి రాగానే, రాజు కీర్తిసేనుడు అతడిలో ప్రవేశపెట్టిన శక్తిని, తిరిగి ఆదిత్యసేనుడి పరం చేసేందుకు, మంత్రపాలుడి కోసం కబురు పంపాడు. అయితే, అతడి జాడ తెలియ లేదు.

కీర్తిసేనుడు బాగా ఆలోచించి, ఆదిత్యసేనుడికి రాజ్యాభిషేకం చేయాలని నిర్ణయించాడు. ఈ సంగతి విన్న విజయసేనుడు, తండ్రితో, "నాన్నా, శత్రువుతో ఒంటరిగా పోరాడి విజయం సాధించిన వాణ్ణి, నేను. అందువల్ల నన్ను కాదని తమ్ముడికి పట్టాభిషేకం చేయబూనడం ధర్మం అనిపించుకోదు. పైగా ఆదిత్యసేను డిప్పుడు శక్తిహీనుడు. అయినా, అతడికే రాజ్యం కట్టబెట్టాలనుకుంటే, మా ఇద్దరి మధ్యా కత్తియుద్ధం ఏర్పాటు చెయ్యండి. గెలిచినవాడు రాజవుతాడు," అన్నాడు.

విజయసేనుడికీ, ఆదిత్యసేనుడికీ మధ్య కత్తియుద్ధం ఏర్పాటు చేయబడింది. అందులో ఆదిత్యసేనుడు మెరుపువేగంతో కత్తితిప్పుతూ, అందరూ ఆశ్చర్యపడే విధంగా, విజయసేనుడి చేతిలోని కత్తి దూరంగా పోయి పడేలా కొట్టాడు.



శక్తిహీనుడైన ఆదిత్యసేనుడు, తననెలా అంతసులభంగా ఓడించగలిగాడో అర్థం కాక ఒక్క క్షణం నిశ్చేష్టుడైన విజయసేనుడు, తన ఓటమిని అంగీకరించి, ఆదిత్యసేనుడు సుమపురి రాజు కావడానికి సమ్మతించాడు.

ఆదిత్యసేనుడి పట్టాభిషేకం జరిగాక, ఒకనాడు కీర్తిసేనుడి చిన్న భార్య స్వయంప్రభ, భర్తను, "మీరు నా కుమారుడైన విజయసేనుణ్ణి కాక, ఆదిత్యసేనుణ్ణి రాజుగా చేశారన్న అసూయ, నాకు ఏ కోశానా లేదు. శత్రువైన సహస్రాక్షుణ్ణి ఓడించి రాజ్యాన్ని రక్షించవలసిన క్లిష్ట సమయంలో కూడా, ఆదిత్యసేనుడు తన

శక్తిని విజయసేనుడికివ్వడానికి ఒక మాత్రానఒప్పుకోలేదు. కానీనాకుమారుడు విజయసేనుడు అన్నిటికీ తన సంసిద్ధతను తెలియబరిచాడు. ఇంకొక విషయం ఏమంటే మంత్రపాలుడు తన శక్తి రూపిణి మంత్రంతో, ఆదిత్యసేనుడి శక్తిని విజయ సేనుడిలో ప్రవేశపెట్టాడు గదా? అయినా, అతడు విజయసేనుణ్ణి సునాయాసంగా కత్తియుద్ధంలో ఎలా ఓడించగలిగాడు?'' అని అడిగింది.

అందుకు కీర్తిసేనుడు చిరునవ్వు నవ్వి, ''వీరుడెన్నడూ స్వశక్తినే నమ్ముకో వాలిగాని, మంత్రశక్తులను కాదు. ఎందు కంటే, ప్రతిసారీ మంత్రశక్తుల్లో సిద్ధులైన వారు, మనకు సాయం చేస్తామంటూ రారు. అందుకే ఆదిత్యసేనుడు, శత్రు వును ఓడించేందుకు మరేదైనా ఆలోచన చేద్దామన్నాడు. కాని, అతడు ఒకసారి తన శక్తిని అన్న కిచ్చేందుకు అంగీకరిం చాక—వివేకి కనక అతడి కొక అను మానం కలిగింది. అందుకే ముందుగా మంత్రపాలుడితో ఏకాంతంగా మాట్లాడా లన్నాడు.'' అంటూ ఇంకా ఏమో చెప్ప బోయాడు.

కాని స్వయంప్రభ, భర్త మాటలకు అడ్డుతగిలి, ''మంత్రపాలుడేమయినట్టు? ఆదిత్యసేనుడికి కలిగిన అనుమానం ఏమిటి?'' అని అడిగింది.

''యుద్ధంలో విజయం సాధించాక, విజయసేనుడి బుద్ధి వక్రించవచ్చనేదే, ఆదిత్యసేనుడి అనుమానం. అందుకే, ముందుగా అతడు మంత్రపాలుడితో ఏకాంతానమాట్లాడి, యుద్ధానంతరం తన శక్తిని తానే స్వయంగా తిరిగి తెచ్చుకునేం దుకు అవసరం అయిన మంత్రాన్ని తెలుసుకుని వుంటాడు. ఈ సంగతి తెలిస్తే, విజయసేనుడు ఆగ్రహంతో అతడి మీద పగబట్టి, ఏ హత్యాప్రయత్నమో చేయవచ్చు. అందుకే, మంత్రపాలుడు ఎవరికీ చెప్పకుండా రహస్యంగా నగరం వదిలిపోయాడు,'' అన్నాడు కీర్తి సేనుడు.






## 9

[సత్యసేనుడు పరిపాలించే అమృతపురి మీదికి దాడి జరపడానికి వీరసింహుడు రహస్య పథకం వేశాడు. ఈ వార్త తెలిసిన రాజు సత్యసేనుడు, వీరసింహుడితో సంధికుదుర్చుకోమని తనమంత్రిని కోరాడు. అయితే, వీరసింహుడి సేనలు పడవలపై సుమతీనదిని దాటుతున్నప్పుడు, హఠాత్తుగా వెల్లువ రావడంతో, సేనలు ప్రవాహంలో కొట్టుకుపోయాయి. తరవాత—]

హఠాత్తుగా జరిగిన ఈ ఘోరదుర్ఘటనకు దిగ్భ్రాంతి చెందిన వీరసింహుడు నది గట్టున శిలలా నిలబడిపోయాడు. కొత్త సేనాధిపతి కపాలకంఠుడు భయంతో నోరు తెరవలేకపోయాడు. చావు తప్పించుకున్న కొందరు దళనాయకులు మాత్రం, ప్రవాహంలో కొట్టుకుపోతూన్న ఆయుధ సామగ్రిని కొంత గట్టు మీదికి చేర్చారు. కాని, చాలవరకు ఆయుధాలు వెల్లువ పాలయ్యాయి. కొన్ని ఆయుధాలను, నదికి ఆవలిగట్టున వున్న అమృతపురి సైనికులు గట్టుకుచేర్చారు. ప్రవాహంలో కొట్టుకుపోతూన్న వీరసింహుడి సైనికులు కొందరిని అమృతపురి సైనికులు గట్టుకు లాగి ప్రాణాలు రక్షించారు. వారినందరినీ యుద్ధ ఖైదీలుగా చెరసాలలలో బంధించారు.

మరునాడు రాజు సత్యసేనుడు, అధికారులను సమావేశపరచి, "శత్రు సైని



సేనాధిపతి రాజుతో, "ప్రభూ, నదీ ప్రవాహం నుంచి మన సైనికులచే రక్షింపబడిన వీరసింహుడి సైనికులు చాలామంది, శాంతిపురానికి తిరిగి వెళ్ళడానికి ఇష్టపడడం లేదు. ప్రభువులు అనుమతిస్తే మన సైన్యంలో చేరడానికి సిద్ధంగా వున్నారు!" అన్నాడు.

రాజు ఒక్క క్షణం ఆలోచించి, "వీరసింహుడు సుమేధరాజ్య సింహాసనాన్ని ఆక్రమించినప్పుడు దురదృష్టవశాత్తు నేను అనారోగ్యం పాలయ్యాను. నా అల్లుడూ, కూతురూ, మనమడూ ఏమయ్యారో తెలియదు. వాళ్ళను గురించిన వివరాలు రాబట్టాలి. పైగా ఎక్కువ జననష్టం కలిగించే యుద్ధం చేయాలన్నది మన అభిమతం కాదు. కాని, దుర్మార్గుడయిన వీరసింహుడు, అమాయకులైన సుమేధ ప్రజలకు యుద్ధానికి మించిన కష్టాలు కలిగిస్తున్నప్పుడు, వాటిని అరికట్టే బాధ్యత మనకున్నది. కాబట్టి, మన పక్షం చేరాలని ఇష్టపడే వీరసింహుడి సైనికులను పరిశోధించి, మన సైన్యంలో చేర్చుకోండి," అన్నాడు.

తరవాత మంత్రి, "ప్రభూ మరొక శుభవార్త! శాంతిదేవమహారాజుగారి వృద్ధమంత్రి, వీరసింహుడు చేసిన హత్యా ప్రయత్నం నుంచి తప్పించుకున్నాడు.

కుల నుంచి సాధించిన ఆయుధాలన్నిటినీ సిద్ధం చేసుకోండి, ఇకమీదట మనకు ఎవరి సానుభూతీ అవసరం లేదు. మన సైనికబలం స్వల్పమైనదే. కాని ఈ ప్రవాహంతో, వీరసింహుడి సైన్యం మనకన్నా బలహీనమైపోయింది. అయితే, ఆ దుర్మార్గుడు సైన్యాన్ని బలపరచుకుని మళ్ళీ మనపై దాడి జరిపితే ఎదుర్కొవడానికి సిద్ధంగా ఉండాలి. పట్టుబడిన వీరసింహుడి సైనికులను వెంటనే విడిచిపెట్టండి," అని ఆజ్ఞాపించాడు.

ఆ రోజురాత్రి మంత్రీ, సేనాధిపతీ, ఇద్దరు దళనాయకులూ రాజు సత్యసేనుణ్ణి రహస్యంగా కలుసుకున్నారు. అప్పుడు

ఇప్పుడాయన మన రాజ్యంలోనే వున్నాడు!" అన్నాడు.

"అలాగా! వృద్ధమంత్రి సుగుణ శీలుడూ, వివేకసంపన్నుడూ అన్న విషయం మనమెరిగినదే. అయినా, హంత కుల బారినుంచి తప్పించుకోగలిగినంత వీరుడన్న విషయం తెలియదు!" అన్నాడు రాజు.

"వృద్ధమంత్రి అంతటి సాహసం చేయ లేదు ప్రభూ! సమయానికి ఒక ముసుగు వీరుడు గుర్రంపై వచ్చి, వీరసింహుడు నియోగించిన హంతకులను తృటిలో హత మార్చి, వృద్ధమంత్రిని రక్షించి మన రాజ్యానికి పంపాడు. వృద్ధమంత్రి అభి ప్రాయం ప్రకారం, ఆ ముసుగు వీరుడు మరెవరో కాదు...." అని ఇంకేదో చెప్ప బోయాడు మంత్రి.

అంతలో రాజు ఉత్సాహంతో లేచి పాన్పుపై కూర్చుంటూ, "ఎవరా ముసుగు వీరుడు? శాంతిదేవుడేనా? వెంటనే వృద్ధ మంత్రిని రప్పించు. ఆయనతో మాట్లా డాలి!" అన్నాడు.

"అలాగే రప్పిస్తాను ప్రభూ. ఇంకొక విషయం కూడా వినండి. వృద్ధమంత్రిని రక్షించిన ఆ ముసుగువీరుడే, సుమేధరాజ్య పౌరుడయిన వసంతుడనే యువకుణ్ణి కూడా వీరసింహుడు విధించిన మరణ



శిక్ష నుంచి రక్షించాడు. వసంతుడికి రాజు శాంతిదేవుడిపట్ల అభిమానమూ అపార గౌరవాదరాలూ వున్నాయి. వీరసింహుడి దుష్టపాలనను అంతమొందించాలన్న పట్టుదలతో, మారు వేషాలతో తిరుగుతూ సుమేధ రాజ్యంలోని యువకులందరినీ తన పక్షానికి తిప్పుకుంటున్నాడు. వసం తుడే వీరసింహుడి దాడి గురించి మనకు ముందే తెలియజేశాడు, అతనిపట్ల మనం ఎలా వ్యవహరించాలో తెలియడం లేదు," అన్నాడు మంత్రి.

రాజు మళ్ళీ కొంతసేపు మౌనంగా ఆలోచించి, "వీరసింహుడు, రాజకుటుం బాన్ని సమూలంగా నాశనం చేయడానికి



పూనుకున్నా, మనం సుమేధ రాజ్య వ్యవహారాలలో ఎలాంటి జోక్యమూ కల్పించుకోలేదు. అయినా, ఆ విశ్వాసఘాతకుడు మనమీదికి దండెత్తడానికి వెనుకాడలేదు! అందువల్ల ఆ దుర్మార్గుడి పాలనకు ఎదురుదిరిగే వసంతుడికీ, అతని అనుచరులకూ తోడ్పడి ప్రోత్సహించడం మన కర్తవ్యం. ఎలా ప్రోత్సహించాలో మీకు తెలుసు కదా!'' అన్నాడు.

''ఈ క్షణంనుంచి మీ అజ్ఞానుసారం నడుచుకుంటాను.'' అని రాజుకు నమస్కరించి, మంత్రి, సేనాధిపతి దళనాయకులతో కలిసి బయలుదేరాడు.

* * *

నదీతీరం నుంచి విషాదంతో రాజప్రాసాదం చేరిన వీరసింహుడు, సేనాధిపతి కపాలకంఠుణ్ణి పిలిపించి, ''అయినా, వెల్లువ రావచ్చునని మనల్ని ముందుగా ఎవరూ హెచ్చరించలేదెందుకు?'' అని అడిగాడు.

''ఈ రుతువులో వెల్లువరావడం అనేది చాలా అరుదైన విషయం ప్రభూ. అందువల్ల ఈ అపాయాన్ని ఎవరూ ఊహించలేక పోయారు. ఇంతెందుకు? మన అస్థాన జ్యోతిష్కుడే, అది అద్భుతమైన ముహూర్తమని దండయాత్రకు కాల నిర్ణయం చేశాడు!'' అన్నాడు కపాలకంఠుడు.

''ఆ దుర్మార్గుణ్ణి వెంటనే హతమార్చు!'' అన్నాడు వీరసింహుడు.

''అతడు కనిపించడం లేదు ప్రభూ. సైన్యం నదీతీరానికి చేరినప్పుడు జ్యోతిష్కుడు సైన్యం వెనకే వున్నాడు. ఆ తరవాత నదీప్రవాహంలో కొట్టుకుపోయాడో, లేక ప్రాణాలతో తప్పించుకుని అమృతపురికి పారిపోయాడో తెలియడం లేదు ప్రభూ!'' అన్నాడు కపాలకంఠుడు.

''అమృతపురి! అమృతపురి! అది మనపాలిటి యమపురిలా దాపురించేలా వున్నది!'' అని అరిచాడు వీరసింహుడు అగ్రహావేశంతో.

"అలా అనకండి ప్రభూ! అమృత పురిని మనం జయించి తీరుతాం. కొత్తగా ఆయుధాలు సేకరించుకుని, సైన్యాన్ని బల పరచుకున్నట్టయితే అమృతపురి నిమిషా లలో మన వశమవుతుంది. అంతవరకు ఓపికపట్టాలి!" అన్నాడు కపాలకంఠుడు.

"ఇంకా ఎంతకాలం ఓపికపట్టడం? ఎక్కడి నుంచి ఆయుధాలు సేకరించడం?" అని ప్రశ్నించాడు వీరసింహుడు.

"మన దగ్గరధనం వుంటే ఎంత దూరం నుంచయినా ఆయుధాలు కొనుగోలు చేయవచ్చు. సైనికులను కొత్తగా చేర్చుకో వచ్చు." అన్నాడు కపాలకంఠుడు.

"అందుకు కావలసిన ధనం మనవద్ద లేదే! బావులు తవ్వడం, బాటలు వేయడం, విద్యాలయాలూ, ధర్మసత్రాలూ కట్టడం మొదలైన ప్రజోపయోగకార్యాల కని శాంతిదేవుడు ఖజానాలో వున్న ధనాన్నంతా ఖాళీ చేసేశాడు. ఇప్పుడు మనం ఏం చేయడం?" అన్నాడు వీర సింహుడు నిస్పృహతో.

"మహాప్రభూ, ఈ ఏడు మన రాజ్యంలో వరిపంట బాగా పండింది. మన రాజ్యంలో కన్నా చంద్రపురిలో వరికి ఐదురెట్లు ఎక్కువ ధర పలుకుతుంది. నాణ్యమైన కత్తులకూ, ఈటెలకూ చంద్రపురి పెట్టింది పేరు. మనం చంద్రపురిలో మన ధాన్యం



అమ్మి, అక్కడినుంచి ఆయుధాలను తెచ్చుకోవచ్చు." అన్నాడుకపాలకంఠుడు.

"అద్భుతమైన సలహా! సామాన్య రైతులనుంచి పంటలో సగభాగమూ, భూస్వాముల నుంచి పంటలో మూడు వంతులూ శిస్తుగా వసూలు చెయ్యమని చెప్పు." అని ఆజ్ఞాపించాడు వీరసింహుడు.

"చిత్తం మహాప్రభూ! శిస్తు వసూళ్ళు మొదటభూస్వాములనుంచిప్రారంభిస్తాం. ఈ రోజు భూస్వామి రఘునాధుడి ఇంటికి మనుషులను పంపిస్తాను," అని కపాల కంఠుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

రామవరంలో రఘునాధుడు ధర్మబుద్ధి గల గొప్ప భూస్వామి. ఆయనకు వరి



పండే మాగాణి పొలాలు చాలా వున్నాయి. రామవరం ప్రజలు రఘునాధుడి వద్ద కావలసినప్పుడు, కావలసినంత ధాన్యం తీసుకునిపోయి, వీలయినప్పుడు డబ్బుగా గానీ, ఇతర వస్తురూపంలోగాని తిరిగి చెల్లించేవారు. ఇది రఘునాధుడి తండ్రి కాలం నుంచి వస్తున్నది.

ఆ రోజు మధ్యాన్నం రఘునాధుడి ధాన్యాగారం ముందు వందలాదిమంది గ్రామస్థులు చేతుల్లో గంపలతోనూ, సంచులతోనూ నిలబడి వున్నారు. అప్పుడు యువకుడయిన ఒక రాజోద్యోగి ఇరవై మంది రాజభటులనూ, యాభై ఎడ్లబళ్లనూ వెంటబెట్టుకుని గుర్రం మీద అక్కడికి వచ్చి, "ఈ ధాన్యంలో మూడు వంతులు రాజుగారికి చేరాలి!" అన్నాడు.

"ఎందుకు?" అని అడిగాడు రఘునాధుడు.

"నువ్వు చెల్లించవలసిన పన్ను," అన్నాడు అధికారి.

"నేను పన్ను పూర్తిగా చెల్లించాను. బాకీ ఏదీ లేదే!" అన్నాడు రఘునాధుడు.

"ఇది అదనపు పన్ను. ఈ ధాన్యాన్ని చంద్రపురికి తీసుకుపోవాలి!" అన్నాడు అధికారి.

"మరి ఈ ధాన్యాన్నే నమ్ముకుని వున్న ఈ గ్రామస్థుల గతేమిటి?" అని అడిగాడు రఘునాధుడు.

"ఈ ధాన్యాన్ని నమ్ముకోమని వాళ్ళకు ఎవరు చెప్పారు?" అన్నాడు అధికారి.

అతడి వెంట వచ్చిన రాజభటులు గ్రామస్థులకేసి కొరడాలు ఝుళిపిస్తూ, "ఊఁ... ధాన్యాన్ని బస్తాలలో నింపి, బళ్ళకెక్కించండి," అని ఆజ్ఞాపించారు.

"మా కడుపులు కొట్టకండి బాబూ," అని గ్రామస్థులు ఎంత మొరపెట్టుకున్నా ప్రయోజనం లేకపోయింది. ఆఖరికి గ్రామస్థులే ఆ ధాన్యాన్ని బస్తాలలో నింపి, బళ్ళకెక్కించారు. బళ్ళన్నీ నిండేసరికి సాయంకాలమయింది. బళ్ళు పడమటి దిక్కుగా కదిలాయి. గ్రామస్థు లందరూ

తలలు వంచుకుని దీనంగా బళ్ళ వెంట కొంతదూరం నడిచారు. ఆ దృశ్యాన్ని చూసి, అధికారి లోలోపల ఆనందించ సాగాడు. అయితే, హఠాత్తుగా అతనికి ఒక అనుమానం కలిగింది. గ్రామస్థు లందరూ బళ్ళ వెనక ఎందుకు వస్తున్నారు? ఇందులో యువకుల కుట్ర వున్నదేమో అన్న భయంతో, గుర్రాన్ని వెనక్కు తిప్పి, కత్తి ఝుళిపిస్తూ, ''ఇక, మీరందరూ తిరిగి వెళ్ళండి!'' అని అరిచాడు.

ఆ సమయానికి బళ్ళన్నీ ఒక కొండ కనుమను సమీపించాయి. గ్రామస్థుల గుంపులో నుంచి ఒక యువకుడు ''వెయ్!'' అని కేక పెట్టాడు. మరు క్షణమే గుర్రం మీద వున్న రాజోద్యోగి మెడకు దూరం నుంచి విసిరిన దారం ఉచ్చు బిగించుకుపోయింది. వాడు గుర్రం పైనుంచి దభీమని కింద పడ్డాడు. పక్కనున్న కొండపై నుంచి ఆ ఉచ్చును విసిరిన యువకుడు, మరి కొందరు యువకులతో కలిసి వేగంగా కిందికి దిగివచ్చాడు. వాళ్ళు అధికారినీ, రాజభటులనూ, పెడ రెక్కలు విరిచి పట్టుకున్నారు. వాళ్ళతో ఆ యువకుడు, ''భయపడకండి. మీ కెటువంటి హానీ తలపెట్టం,'' అని, బళ్ళ పైకి ఎక్కి, బస్తాలు దింపించి, గ్రామస్థులకు పంచి, ''వీరసింహుడి మనుషులు మిమ్మల్ని ఇంకేమీ చేయలేరు. నిశ్చింతగా మీమీ ఇళ్లకు వెళ్లండి.'' అన్నాడు.

గ్రామస్థులు ధాన్యంతో సంతోషంగా వెనుదిరిగారు.

ఆ తరవాత ఆ యువకుడు, రాజోద్యోగినీ, రాజభటులనూ చెట్లకు బంధించమని తన అనుచరులకు ఆజ్ఞాపించాడు. ఆ తరవాత ఆ రాజోద్యోగితో, ''మీరిక్కడ వున్నట్టు మీ నాయకుడికి తెలియజేస్తాం. ఈ రాజ్యంలో ఎవరి దగ్గరనుంచీ ధాన్యాన్ని బలాత్కారంగా పట్టుకుపోవడానికి అనుమతించమని కపాలకంఠుడికి మా హెచ్చరికగా తెలియజేయండి,'' అని అన్నాడు, ఆ యువకుల బృందానికి నాయకుడైన వసంతుడు. —(ఇంకావుంది)






# కళ-వ్యాపారం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఏమికోరి, అర్ధరాత్రివేళ భయంకరమైన ఈ శ్మశానంలో ఇక్కట్లపాలవుతున్నావో, నాకు తెలియదు. కాని, కోరినది ప్రాప్తించేవేళ, చేజేతులా దాన్ని వదులుకునేవారు కొందరుంటారు. నువ్వు ఆ కోవకు చెందిన వ్యక్తివేమో అన్న అనుమానం కలుగుతున్నది. ఏది ఏమైనా, నీకు శ్రమతెలియకుండా వుండేందుకు పద్మనాభుడనే అతడి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు ఒక చిన్న గ్రామంలో, పద్మనాభుడనే గొప్ప శిల్పి వుండేవాడు. ఎవరో చెప్పిన సలహా విని, అతడు రాజును

## బేతాళ కథలు

దర్శించేందుకు రాజధానికి వెళ్ళాడు. అయితే, ఎన్ని ప్రయత్నాలు చేసినా రాజదర్శనం లభించకపోయేసరికి విసిగిపోయి, తిరిగి తన స్వగ్రామం చేరాడు.

పద్మనాభుడు తయారు చేసే, అందమైన శిల్పాలను ప్రశంసించగల సౌందర్య పిపాసిగాని, వాటిని కొనగల ఆర్థికస్థోమతు వున్న వ్యక్తిగాని, ఆ గ్రామంలో లేడు. అందువల్ల, పద్మనాభుడు దారిద్ర్య బాధతో కుంగిపోతూ, ఇంతకన్న మరణం మేలనుకుంటూండేవాడు.

ఇలాంటి స్థితిలో, చాలా దూరంలో వున్న ఒక గ్రామాధికారి నుంచి అతడికి పిలుపు వచ్చింది. అయన పద్మనాభుడితో, "నువ్వు శిల్పాలు చెక్కే వృత్తిలో వున్నావని, ఈ మధ్యనే తెలియవచ్చింది. నీకు నెలకు యాభైవరహాలు జీతం యిస్తాను. నీకు చేతనైన శిల్పాలు చెక్కి, నాకు యిస్తూవుండు," అన్నాడు.

ఇందుకు పద్మనాభుడు పెద్దగా నవ్వి, సరేనన్నాడు. అప్పటి నుంచి అతడు పగలనక, రాత్రనక ఏదో ఆలోచిస్తూ, ఏవేవో శిల్పాలు చెక్కసాగాడు. గ్రామాధికారి వాటిని చుట్టుపక్కల గ్రామాల్లో వున్న ధనికులకు అమ్మి, మంచి లాభాలు గడించేవాడు.

ఇలా కొంతకాలం జరిగాక, పద్మనాభుడు చెక్కిన శిల్పాలలో కొన్నిటిని, ఒక జమీందారు చూడడం జరిగింది. అయన, అతణ్ణి గురించి విచారించి,



కబురుపంపి పిలిపించి, "పద్మనాభా, నీకు ఒక గ్రామాధికారి నెలకు యాభై వరహాల జీతం యిస్తూ, నువ్వు చెక్కిన శిల్పాలన్నీ సొంతం చేసుకుని, నిన్ను నిలువుదోపిడీ చేస్తున్నాడని విన్నాను. ఇది సహించరాని దురన్యాయం. నేను, నీకు నెలకు వందవరహా లిస్తాను. నువ్వు తయారుచేసే శిల్పాలన్నీ నాకు పంపుతూండు," అన్నాడు.

ఇందుకు పద్మనాభుడు చిన్నగా నవ్వి, సరేనన్నాడు. అతడు ఏనాడూ సరిగా తిండి తినేవాడు కాదు. ఒక్కొక్కసారి నిద్రపోతూ హఠాత్తుగా మేలుకుని, ఏవేవో ఆలోచిస్తూ శిల్పాలు చెక్కుతూండేవాడు. వాటిని జమీందారు దూరంగా వున్న పట్టణంలో అమ్మించి, విపరీతంగా ధనం కూడబెట్ట సాగాడు.

ఒకనాడు, ఆ ప్రాంతాలకు పరిపాలకుడైన సామంతరాజు, పట్టణంలో పద్మనాభుడి శిల్పాలు చూడడం జరిగింది. ఆయన సంగతి సందర్భాలు తెలుసుకుని, పద్మనాభుడికి కబురు పంపాడు.

పద్మనాభుడితో, సామంతరాజు, "నువ్వు చెక్కిన శిల్పాలు చూశాను. ఇకనుంచి నా కొలువులో వుండు. నీకు నెలకు వెయ్యి వరహాలిస్తాను," అన్నాడు.

పద్మనాభుడు మౌనంగా నవ్వి, సరేనన్నాడు. అతడి ఉలి స్పర్శసోకితేచాలు, ఎలాంటి కఠిన పాషాణమైనా, సజీవ మూర్తిగా మారిపోయేది. సామంతరాజు





వాటిని, తనతోటి సామంతరాజులకు కానుకలుగా పంపి, వాళ్ళతో స్నేహాలూ, ఒప్పందాలూ చేసుకోసాగాడు.

ఒకసారి సామంతరాజు కప్పంతోపాటు, చక్రవర్తికి పద్మనాభుడి శిల్పాలు కొన్ని బహూకరించాడు. ఆ శిల్పకళానైపుణ్యానికి అచ్చెరువుచెంది, చక్రవర్తి పద్మనాభుడిని తీసుకురావలసిందిగా బోయీలతో బంగారుపల్లకీని పంపాడు.

సరిగ్గా అదే సమయంలో బలభద్రుడనే పేదయువకు డొకడు, పద్మనాభుణ్ణి చూడవచ్చి, అతడి పాదాలు తాకి, "మహాత్మా, నాకు శిల్పకళలో కొద్దిపాటి పరిచయం వున్నది. మీకు ఎంతోకాలంగా ఏకలవ్య శిష్యత్వం చేస్తున్నాను. గురువు లేని విద్య గుడ్డివిద్య అంటారు, పెద్దలు. మీకు శిష్యుడిగా వుండి, శిల్పకళలో అమోఘమైన ప్రావీణ్యాన్ని సంపాదించాలని, నా ఆశ. నన్ను మీ శిష్యులుగా అనుగ్రహించండి!" అని ప్రాధేయపడ్డాడు.

పద్మనాభుడు అప్పటికి బలభద్రుడితో ఏమీ అనకుండా, రాజధానికి వెళ్ళాడు. చక్రవర్తి అతణ్ణి నిండుకొలువులో, "నీ అంత మహాశిల్పిని, ఇంతవరకూ నేను చూడలేదు. నిన్ను మా ఆస్థానశిల్పిగా నియమిస్తున్నాను," అన్నాడు.

అందుకుపద్మనాభుడు, "క్షమించండి, ప్రభూ! నేను మా గ్రామానికి తిరిగి వెళ్ళి, శేషజీవితాన్ని ప్రశాంతంగా గడపాలనుకుంటున్నాను," అన్నాడు.

అతడి జవాబుకు, సభలో వున్నవారనుకున్నట్టు చక్రవర్తి కోపగించుకోక, "అలాగే చెయ్యి. కాని, నిన్నింతదూరం రప్పించి, ఉత్తచేతులతో పంపడం నాకిష్టం లేదు!" అంటూ అతడికి పెద్ద మొత్తంలో ధనం ఇచ్చి, సగౌరవంగా సాగనంపాడు.

పద్మనాభుడు, ఆ ధనంతో తన గ్రామంలో శిల్పకళా శిక్షణాలయాన్ని ప్రారంభించి, బలభద్రుణ్ణి తొలి శిష్యుడుగా చేర్చుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఏరు దాటాక తెప్పతగలబెట్టినట్టు, పద్మనాభుడు గ్రామాధికారి నుంచి, సామంత రాజు వరకూ తన యజమానులను మార్చడం, ఆశబోతుతనం కాదా? మొదట రాజధానికి వెళ్ళి, ఎంత ప్రయత్నించినా చక్రవర్తి దర్శనం లభించక, వెనుదిరిగిన పద్మనాభుడు, ఆ తరవాత అదృష్టవశాత్తూ లభించిన ఆస్థాన శిల్పాచార్యుని పదవిని ఎందుకు తిరస్కరించాడు? పూర్వం జరిగిన అవమానాన్ని మరిచిపోలేని అహంకారమా? లేక ఆస్థాన శిల్పి పదవి విలువ తెలియని మూర్ఖత్వమా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పద్మనాభుడు ఆశబోతు కాదు. అహంకారి కాదు. అవివేకీ, మూర్ఖుడూ అసలే కాదు. కీర్తికాంక్ష, ధనదాహం అతడికి ఏకోశానా లేవు. గ్రామాధికారి నుంచి, చక్రవర్తి దాకా అతడు వెళ్ళింది, తన కళను ఎవరైనా కళాత్మక దృష్టితో గౌరవిస్తారేమో అన్న ఆశతో. కాని, ప్రతి ఒక్కరూ తమ స్థాయికి తగినట్టు, అతడి కళతో వ్యాపారం చేసిన వాళ్ళే. చక్రవర్తిది మామూలు వ్యాపార ధోరణి కాకపోవచ్చు. అయినా, ఆయన కూడా పద్మనాభుడు ఆర్థికంగా స్థిరపడిన తర్వాతే, సాంఘికంగా పరపతి సంపాదించుకున్నాకే గుర్తించాడు. కళాకారుడికి నిజమైన సన్మానం, తోటి కళాకారుడు తనను అనుకరించాలని ప్రయత్నించడమే! ఈ విషయం బలభద్రుడి మాటల్లో బహిర్గతమైంది. అలాంటివారిని సమర్థులైన కళాకారులుగా తయారు చేయాలనే ఉద్దేశంతోనే, అతడు ఆ తరవాత శిల్ప కళావిద్యాలయాన్ని స్థాపించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్ రచన]





# వడ్డీపద్దులు

కనకశెట్టి అనే ఆయన పెద్ద వడ్డీవ్యాపారి. ఆయనవద్ద నరసింహం అనే యువకుడు వడ్డీపద్దులు చూస్తూండేవాడు. చాలా నమ్మకంగా పనిచేసే నరసింహానికి, ఒక జమీందారు దివాణంలో అధిక వేతనం మీద పని దొరకడంతో, కనకశెట్టి వద్ద పనిమాని వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత చాలాకాలం వరకు కనకశెట్టికి, ఎంత ప్రయత్నించినప్పటికీ పద్దులు రాయడానికి సరిఅయినవాడు దొరకలేదు. ఆయనకు అటు వడ్డీ వ్యాపారం, ఇటు పద్దులు రాయడం తనే చూసుకోవాలంటే చాలా ఇబ్బందిగా తయారైంది.

ఈ సంగతి విన్న పాతగుమాస్తా నరసింహం, ఇద్దరు యువకులను కనకశెట్టి వద్దకు పంపించి, వారిలో ఒకర్ని పనిలోకి తీసుకోమన్నాడు.

నరసింహం పంపిన రామచంద్రం, గోవిందం అనే ఆ ఇద్దరు యువకులను చూసి, కనకశెట్టి, "మీ ఇద్దరికీ నేను రాసుకున్న రెండు పద్దు పుస్తకాలిస్తాను. వాటిలో వున్న పద్దులను జాగ్రత్తగా చూసి, ఏవైనా తప్పులెక్కలు వుంటే, నాకు చెప్పండి," అన్నాడు.

ఆయన లోపలిగదిలోకి వెళ్ళి, రెండు పద్దుపుస్తకాలు తెచ్చి, ఇద్దరికీ చెరొకటీ ఇస్తూ, "రేపు సాయంకాలానికల్లా, వీటిలోని పద్దులను సరిచూసి, నాకు అప్పచెప్పాలి," అన్నాడు.

రామచంద్రం, గోవిందం సరేనని తల వూపి, అతని దగ్గరి నుంచి పుస్తకాలను తీసుకుపోయారు.

ఆ మర్నాటి సాయంత్రం ఇద్దరూ పద్దు పుస్తకాలతో తిరిగివచ్చి, కనకశెట్టికి ఇచ్చారు.

రాంబాబు

కనకశెట్టి చిన్నగా నవ్వుతూ రామచంద్రం కేసి చూసి, "నా పద్దులలో ఏమైనా తప్పులు నీకు కనిపించాయా?" అని అడిగాడు.

అందుకు రామచంద్రం, "చాలావరకు పద్దులు సరిగానే వున్నవి. కాని నలుగురు బాకీదారుల విషయంలో, మీరు పొరబాటున తక్కువ వడ్డీ కట్టారు. అలాగే పొరబాటున మరొక ఐదుమందికి ఎక్కువ వడ్డీ వేశారు కూడా," అన్నాడు.

"సరే, నీకిచ్చిన పద్దు పుస్తకం సంగతేమిటి?" అని కనకశెట్టి, గోవిందాన్ని ప్రశ్నించాడు.

"అయ్యా, మీరు నాకిచ్చిన పుస్తకంలో, పద్దులన్నీ—ముగ్గురు వ్యక్తుల విషయంలో తప్ప మిగతావన్నీ సరిగానే వున్నవి. ఆ ముగ్గురికి సంబంధించిన లెక్కల్లో మీరొక పొరబాటు చేశారు," అన్నాడు గోవిందం వినయంగా.

"ఏమిటీ, నేను పొరబాటు చెయ్యడమా? ఆశ్చర్యంగా వున్నది. అయినా, ఏమిటా పొరబాటు?" అని అడిగాడు కనకశెట్టి.

"వాళ్ళ అప్పులకు తక్కువ వడ్డీ కట్టారు," అన్నాడు గోవిందం.

"అలాగా!" అంటూ కనకశెట్టి చిరునవ్వునవ్వి, రామచంద్రంతో, "మరేం అనుకోక, నువ్వు మరెక్కడైనా ఉద్యోగ ప్రయత్నం చెయ్యి. అంత ఫలించకపోతే, మరొకసారి కనబడు. ఈలోపల నేను,



మా పాతగుమాస్తా నరసింహంతో మాట్లాడ తాను,'' అన్నాడు.

రామచంద్రం వెళ్ళిపోగానే, ఆయన గోవిందం కేసి తలతిప్పి, ''నువ్వు చెప్పిన, ఆ పొరబాటు సంగతి నిజమే. కాని, అదే పద్దు పుస్తకంలో నలుగురు వ్యక్తులకు ఎక్కువ వడ్డీ వేశాను. ఆ సంగతి నువ్వు గమనించలేదా ?'' అని అడిగాడు.

''అయ్యా, పొరబాటున ఎక్కువ వడ్డీ వేయడంవల్ల, మనకు నష్టం లేదు కదా! అంతేకాక, మన దగ్గిర వడ్డీకి డబ్బు తీసుకున్నవాళ్ళు, తిరిగి మనం చెప్పిన వడ్డీని లెక్క లేసుకుని సరిచూసుకుంటారు. అప్పుడు పొరబాటు గుర్తించి, వాళ్ళే మనల్ని అడుగుతారు,'' అన్నాడు గోవిందం.

''ఒకవేళ వాళ్ళు, ఆ పొరబాటు తెలుసుకోలేకపోతే ?'' అని ప్రశ్నించాడు కనకశెట్టి.

ఆ ప్రశ్నకు గోవిందం నవ్వి, ''అప్పు తీసుకున్నవాళ్ళెవరూ, అది చెల్లించేటప్పుడు అజాగ్రత్తగా వుండరు. ఒకవేళ వాళ్ళడగకపోతే, ఆ ఎక్కువ వడ్డీ డబ్బు మనకే లాభం అవుతుంది. అందువల్లనే, ఆ పొరబాటు గమనించి కూడా నేను తమకు చెప్పకుండా వూరుకున్నాను,'' అన్నాడు.

''బాగానే వున్నది. మరి నేను వేసిన తక్కువ వడ్డీ సంగతి మాత్రం ఎందుకు చెప్పావు ?'' అని అడిగాడు కనకశెట్టి ఆశ్చర్యంగా.

''మనం పొరబాటుకొద్దీ అప్పు తీసుకున్నవాళ్ళ నుంచి, అనుకున్న వడ్డీకాక తక్కువ తీసుకోవడం మనకు నష్టంకదా! ఆనష్టాన్ని వాళ్ళనుంచి రాబట్టడం చాలా కష్టమైన పని. అందుచేతనే, ఈ విషయాన్ని వెంటనే మీ దృష్టికి తెచ్చాను,'' అన్నాడు గోవిందం.

ఆ జవాబుకు కనకశెట్టి లోలోపల సంతోషిస్తూ, ''నువ్వు నా పాతగుమాస్తా నరసింహానికి ఎందునా తీసిపోవు. రేపే వచ్చి పనిలో చేరు,'' అన్నాడు.



# చందమామ అనుబంధం—19

## మన విజ్ఞాన సంపద

### ఎవరాయన?

నర్మదానది పుట్టేచోట గొప్ప ముని వుండేవాడు. ఆయనకు చాలాకాలం వరకు సంతానం కలగకపోవడంతో, శివుణ్ణి ఆరాధించి సంతానం ప్రసాదించమని ప్రార్థించాడు. శివుడు ప్రత్యక్షమై సామాన్యమైన తెలివితేటలతో దీర్ఘాయువు కలిగిన కొడుకు కావాలో, పన్నెండేళ్లు మాత్రమే జీవించే విద్యావివేక సంపన్నుడైన కుమారుడు కావాలో కోరుకోమన్నాడు. అల్పాయుష్కుడైనప్పటికీ పండితుడైన కుమారుడే కావాలన్న వరం కోరాడు ముని.

మునికి కొడుకు పుట్టాడు. అతడు సకల విద్యలసూ నేర్చుకుంటూ పెరిగేకొద్దీ మునిలో విచారం కూడా ఎక్కువ కాసాగింది. ఒకనాడు ముని, శివుడి వరం గురించి కుమారుడికి చెప్పాడు. మునికుమారుడు ఏకాంత ప్రదేశానికి వెళ్ళి, శివుణ్ణి గురించి తపస్సు ప్రారంభించాడు. అతడి ఆయుష్కాలం పూర్తికావడంతో, యమదూతలు వచ్చారు. అయినా, ముని కుమారుడు తదేకధ్యానంతో శివుడిలో లీనమై వుండడంవల్ల, యమభటులు అతన్ని కనుగొనలేక తిరిగిపోయారు. ఆ తరవాత అతడు చిరకాలం చిరంజీవిగా వర్ధిల్లాడు!

ఈ మునికుమారు డెవరు?

(36వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. అంటార్కిటికాలోని మంచు కరిగిందంటే ఏర్పడే పర్యవసానం ఏమిటి?
2. మన సౌరమండలంలోని గ్రహాలన్నిటినీ తనలో ఇముడ్చుకోగలిగినంత బ్రహ్మాండమైన గ్రహం ఏది?
3. చీనా రైతులు, దాదాపు 80 శాతం సరిగ్గా వుండే వాతావరణ సూచనలను ఏ పద్ధతులద్వారా గ్రహిస్తారు?
4. లోలకం ద్వారా గడియారాలను నడవవచ్చునని కనుగొన్న వారెవరు?
5. ఈనాటికీ నిప్పును ఉపయోగించని ఆటవికతెగ భారతదేశంలో ఎక్కడ ఉన్నది?

(36వ పేజీ చూడండి)

## భారతదేశం: నాడు - నేడు

# కురుక్షేత్రం

కురుక్షేత్రం అత్యంత ప్రాచీనమైన చరిత్ర కలిగినది. ఎందుకంటే, అతి ప్రాచీనమైన ఋగ్వేదంలో సైతం దీని ప్రస్తావన ఉన్నది. కురుచక్రవర్తి యజ్ఞం చేయడంవల్ల ఈ ప్రాంతానికి కురుక్షేత్రమనే పేరు వచ్చింది. కురు




పాండవుల మధ్య మహాభారతయుద్ధం ఇక్కడేజరగడంవల్ల ఇదిమరింత ప్రసిద్ధి గాంచింది. భారత యుద్ధారంభంలో శ్రీకృష్ణుడు అర్జునుడికి గీతోపదేశం ఇక్కడే చేశాడు. కృష్ణార్జున సంవాదం జరిగినస్థలాన్ని జ్యోతిసర్ అని అంటారు. భగవద్గీత ఆవిర్భావానికి వేదిక కల్పించడంవల్ల ధర్మక్షేత్రంగా పేరు గాంచిన కురుక్షేత్రం మన భారతీయ సాహిత్యంలో సుస్థిరస్థానం కలిగి వున్నది!

యుగయుగాలుగా కురుక్షేత్రంలో ఎందరో మహానుభావులు నివసించారు. వ్యాసుడు ఇక్కడే కొన్ని పురాణాలు రచించినట్టు చెబుతారు. సుప్రసిద్ధ వ్యాకరణకర్త పాణిని కూడా ఇక్కడే నివసించాడు.

ప్రస్తుతం అంతర్వాహినిగా ప్రవహిస్తున్నదని విశ్వసింపబడే సరస్వతీనది ఒకప్పుడు ఈ ప్రాంతంగుండా ప్రవహించడంవల్ల, ఇది సిరిసంపదలతో తులతూగేది. ఆ కారణంగా ఎన్నో దండయాత్రలను కూడా ఎదుర్కోవలసి వచ్చింది.

ఈనాటి కురుక్షేత్రం చండీఘడ్‌కు 88 కి. మీ. దూరంలో ఉన్నది. కురుక్షేత్రంలోని బ్రహ్మసర్ అనే సరస్సు చుట్టూ 365 అందమైన దేవాలయాలు ఉన్నాయి. సూర్యగ్రహణం రోజున లక్షలాదిమంది భక్తులు ఈ సరస్సులో పవిత్రస్నానం చేస్తారు.

హర్యానా రాష్ట్రంలోని కురుక్షేత్రం, ఈనాడు వివిధ కార్యకలాపాలకు కేంద్రంగా వుంటున్నది. కురుక్షేత్ర విశ్వవిద్యాలయంతోపాటు, అనేక మత, సాంస్కృతిక, విద్యాసంస్థలు తమ కార్యక్రమాలను నిర్విరామంగా కొనసాగిస్తున్నాయి. కురుక్షేత్రం ప్రజాహృదయాలలో ఒక విధమైన స్ఫూర్తిని కలుగజేస్తున్నది.

## భూమి వ్యాకోచిస్తున్నదా?

అరవైకోట్ల సంవత్సరాలకు పూర్వం భూమి ప్రస్తుత పరిమాణంలో సగమే వుండేదా? రెండు ధ్రువాలకూ మధ్యదూరం క్రమేణా ఎక్కువయిందా? అలాగే అభిప్రాయపడుతున్నారు — సుప్రసిద్ధ భారతీయ భూగర్భ శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ ఎఫ్. అహమద్. ఇటీవల కొచ్చిన్‌లో జరిగిన భారతీయ విజ్ఞానసదస్సులోచదివిన తన పరిశోధనా వ్యాసంలో ఆయన ఈ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. అయినా, ఈ సిద్ధాంతాన్ని నిరూపించడానికి శాస్త్రీయ ఆధారాలను చూపవలసి వున్నది।



## చందమామ కబుర్లు




## హోమ్స్‌కు స్మారకగృహం!

సుప్రసిద్ధ రచయిత సర్ ఆర్థర్ కానన్ డోయెల్ సృష్టించిన షెర్లాక్ హోమ్స్ సమయస్ఫూర్తికీ, వాక్చాతుర్యానికీ ముగ్ధులు కాని వాళ్ళుండరు. ఇప్పుడు ఆ రచయిత పేర్కొన్న చిరునామాలోనే అంటే — 221 బి, బేకర్ స్ట్రీట్‌లో హోమ్స్‌కు ఒక స్మారక గృహం నిర్మిస్తున్నారు. ఆ గృహంలో రచయిత ఆర్థర్ జీవితానికీ, ఆయన రచనలకూ సంబంధించిన వస్తువులను సేకరించి ప్రదర్శనకు ఏర్పాటు చేయనున్నారు।

# సాహిత్యావలోకనం

1. సర్ ఆర్థర్ కానన్ డోయెల్ వృత్తి ఏమిటి?
2. చైతన్య మహాప్రభు జీవిత విశేషాలను వివరించే గ్రంథం ఏది?
3. 'హెలెన్ ఆఫ్ ట్రాయ్' ఎవరు?
4. జర్మన్ భాషలోని గొప్ప కావ్యం ఏది? రచించిన కవి ఎవరు?
5. 'సాగా' అన్న మాటకు అసలు అర్థం ఏమిటి?

## సమాధానాలు

**ఎవరాయన?**

మృకండముని కుమారుడు మార్కండేయుడు.

**లోకజ్ఞానం**

1. సముద్రాల నీటిమట్టం 240 అడుగులు పెరుగుతుంది; భూమిలో కనీసం నాలుగోవంతు జలమయ మవుతుంది.
2. గురుగ్రహం.
3. కప్పల బెకబెకలనుబట్టి.
4. గెలీలియో.
5. అండమాన్ దీవులలో.

**సాహిత్యం**

1. వైద్యుడు.
2. కృష్ణదాస్ కవిరాజ్ రచించిన 'చైతన్య చరితామృత'.
3. హోమర్ రచించిన 'ది ఇలియడ్' నాయిక.
4. గెథే రచించిన 'ఫాస్ట్'.
5. ఐస్‌లాండ్, నార్వేలలోని సుదీర్ఘ వచనగాథలు.



# వశీకరుడి వాక్కు

మలయావతీ నగరంలో, ధనంజయుడనే ధనవంతుడుండేవాడు. ఆయనకు తరాల తరబడి కూర్చునితిన్నా తరగని ఆస్తి వుండేది. కానీ అనుభవించడానికి ఆయనకు సంతానం లేదు. ఆ దిగులుతోనే భార్య మరణించడంతో, ఆయన దుఃఖంతో కృశించి పోసాగాడు.

అలాంటి సమయంలో వశీకరుడనే సన్యాసి, ఆ ఊరు రావడం జరిగింది. ఆయన త్రికాలవేది అనీ, ఎవరు ఎటువంటి సమస్యలతో వచ్చినా, వాటికి తగిన పరిష్కారం చూపగలడనీ తెలిసి, ధనంజయుడు, ఆయనను తన ఇంటికి ఆహ్వానించాడు.

తర్వాత ధనంజయుడు, సన్యాసికి తనను గురించి సర్వం చెప్పుకుని, తనకు మనశ్శాంతి లభించే మార్గం చెప్పమని కోరాడు.

వశీకరుడు, ధనంజయుడి మానసిక స్థితిని అర్థం చేసుకుని, సంతానం లేక పోయినంత మాత్రాన విచారించడం అవివేకం అని చెప్పి—మనిషి జీవితానికి సంబంధించిన అనేక విషయాలను బోధించాడు.

అప్పుడు ధనంజయుడు, సన్యాసితో, "స్వామీ! నా తదనంతరం ఆస్తిపాస్తులు పంచుకోవడానికి, నా దూరపుబంధువులు, నా మరణం కోసం రాబందుల్లా కాచుకుని వున్నారు. ఆస్తిని వాళ్ళకిచ్చే ఆలోచన నాకు లేదు. దానిని మంచి మార్గంలో ఎలా వినియోగించాలో, మీరే సెలవివ్వండి," అన్నాడు.

వశీకరుడు చిరునవ్వు నవ్వి, "దిగులు పడడం మానుకో. నువ్వు ఇకనుంచి, ఈ జనవాసాలమధ్య జీవించకు. ఏ నిర్జన ప్రదేశానికో పోయి, జీవితం గడుపు.

దాసరి వెంకటరమణ

నీ జీవిత అంతిమ సమయంలో, ముఖం వింత తేజస్సుతో వెలిగిపోయే, ఒక దివ్య పురుషుడు నిన్ను వెదుక్కుంటూ, నీ దగ్గిరకు వస్తాడు. అతని సన్నిధిలో నువ్వు తృప్తిగా కన్ను మూస్తావు. అతడే నీ ఆస్తికి వారసుడు కాగలడు. నీ ఆస్తి అతడి ద్వారా సత్కార్యాలకు వినియోగించబడి, నీకు స్వర్గలోకప్రాప్తి కలుగుతుంది,'' అని చెప్పాడు.

ధనంజయుడు, వశీకరుడి పాదాలను భక్తితో తాకాడు. వశీకరుడు వెళ్ళిపోతూ, ''నా వాక్కు ఎన్నటికీ కల్లకాదు. బాగా గుర్తుంచుకో! నే చెప్పిన ఆ మహానుభావుడి ముఖం తేజస్సుతో వెలిగిపోతూ వుంటుంది.'' అన్నాడు.

ధనంజయుడు తన ఆస్తి యావత్తూ న్యాయాధికారి పరం చేసి, ఆస్తి హక్కు పత్రాలను చూపించిన వ్యక్తికి ఆస్తి అప్పగించమనిచెప్పి, ఆనగరాన్ని వదిలి పెట్టాడు.

అతడు మృణాళినీ నదీ తీరంలోని అరణ్యంలో, ప్రకృతి కనువిందు చేసే ప్రాంతాన ఒక పర్ణశాల నిర్మించుకుని, తన జీవితాన్ని చరితార్థం చేసే మహానుభావుడి కోసం ఎదురు చూడసాగాడు.

ధనంజయుడున్న ప్రాంతాల నివసించే గిరిజనులు చాలా అమాయకులు. వాళ్ళు ధనంజయుణ్ణి సాధువనుకుని, భక్తితో పళ్ళూ, తేనే మొదలైనవి తెచ్చి యిస్తూండే వాళ్ళు. నిత్యం ఎంతోమంది ఆయన వద్దకు వచ్చి తమ సమస్యలు ఏవో చెప్పి,



వాటికి పరిష్కారాలు అడిగేవారు. ధనంజయుడు తనకు తోచిందేదో చెప్పేవాడు.

క్రమంగా అతడి దగ్గిరకు గిరిజనుల రాకపోకలు ఎక్కువయ్యాయి. ఇందువల్ల ధనంజయుడి ఏకాంతానికి భంగం కలగ సాగింది.

ఒకనాడు ధనంజయుడు, గిరిజనుల నాయకుడైన జటాధరుడు అనే వాణ్ణి పిలిచి, ''నేను ఒక మహానుభావుని రాకకై ఎదురు చూస్తూ, ఈ నిర్జన ప్రదేశంలో శేష జీవితాన్ని ప్రశాంతంగా గడుపుతున్నాను. అందువల్ల ఇకముందు ఎవరూ ఇక్కడికి రాకండి,'' అని చెప్పాడు.

అందుకు జటాధరుడు వినయంగా ధనంజయుడికి నమస్కరించి, ''స్వామీ, తమరు చెప్పినట్టే నడుచుకుంటాం. కానీ మీరిక్కడ ఒంటరిగా వుండలేరు. నా కొడుకుల్లో ఒకడు. పదేళ్ళవాడు చాలా చురుకైనవాడు. వాడు మీకు తోడుగా వుంటాడు. మీ కవసరమైన అన్ని పనులూ చేసి పెడతాడు. దయచేసి కాదనకండి,'' అని ధనంజయుణ్ణి ఒప్పించి, తన కొడుకును అక్కడ వదిలిపెట్టి పోయాడు.

వాడి పేరు శివుడు. వాడు పొద్దున లేచింది మొదలు, రాత్రి పడుకునేవరకూ ధనంజయుడికి ఏది కావాలన్నా చేసి పెట్టేవాడు. వాడి సేవలు అతడికి ఎంతగానో తృప్తి కలిగించినై. వాడితో కబుర్లాడుతూంటే, ధనంజయుడికి కాలం తెలిసేది కాదు.



ధనంజయుడు ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్టు వుండడం, శివుడు గ్రహించి, అందుకు కారణం అడిగాడు.

ధనంజయుడు నవ్వుతూ శివుణ్ణి దగ్గిరకు తీసుకుని, "నేను ఒక దివ్య పురుషుడి రాకకోసం ఎదురు చూస్తున్నాను," అన్నాడు.

"దివ్యపురుషుడంటే ఎలా వుంటాడు?" అని అడిగాడు శివుడు.

"పట్టువస్త్రాలు ధరించి, దివ్యతేజస్సుతో వెలిగిపోతూ ఆకాశం నుంచి దిగి వచ్చినట్టుగా వస్తాడు," అన్నాడు ధనంజయుడు.

ఆ మాటలతో శివుడికి ఉత్సాహం కలిగి, ఆ దివ్యపురుషుడిని చూడాలనే కుతూహలంతో తాను కూడా ఎదురు చూడసాగాడు.

కాలం గడిచింది. ధనంజయుడి ఆరోగ్యం నానాటికీ క్షీణించసాగింది. తాను మృత్యువుకు దగ్గిరవుతున్నట్టు, ఆయనకు తోచసాగింది.

ఒకనాడు ధనంజయుడికి, ఇక తాను ఎన్నో రోజులు బతకనన్న దృఢనమ్మకం కలిగింది. ఆయన శివుణ్ణి తన దగ్గిరకు పిలిచి ఏదో చెప్పబోతూ, వాడి ముఖంలోకి చూసి ఆశ్చర్యపోయాడు. శివుడి ముఖంలో ఒక విధమైన తేజస్సు ఉట్టిపడుతున్నది!

ధనంజయుడు ఒక్క క్షణం కలవరపడ్డాడు. తర్వాత దీర్ఘంగా ఆలోచించి, తన అజ్ఞానానికి చింతించాడు. దివ్యపురుషుడంటే పట్టుపీతాంబరాలు ధరించి, ఆకాశం నుంచి దిగి వస్తాడని భావించేవాడే కానీ, అమాయకంగా ప్రవర్తిస్తూ, ముఖంలో వింతతేజస్సుతో వెలిగిపోతున్న ఆ శివుడే, వశీకరుడు చెప్పిన దివ్యపురుషుడని అతడు ఊహించలేక పోయాడు!

ధనంజయుడు వెంటనే జటాధరుడికి కబురుపంపి, తన కథ వివరించి, తన ఆస్తికి సంబంధించిన పత్రాలను అప్పగించి, వాటిని ఏమిచేయాలో చెప్పాడు. ఆ తర్వాత కొద్దిక్షణాల్లోనే ఆయన శివుడి సన్నిధిలో తృప్తిగా కన్నుమూశాడు.





# చిట్టి చలువ

చిట్టి ఎప్పుడూ చలువచేసిన బట్టలే వేసుకుంటుంది. దాన్ని చూస్తే స్నేహితురాళ్ళందరికీ అసూయ. ఇంటి బట్టలుతికే సోమన్న తెచ్చిన బట్టలు, ఒక్క రోజుకే మడత నలిగిపోవడంవల్ల, వాళ్ళెవ్వరూ చిట్టిలాగా ప్రతిరోజూ నలగని బట్టలు వేసుకోలేరు. మరి చిట్టికైతే తన బట్టలు తనే చలువచేసుకోవడంవచ్చు. ఏరోజు బట్టలారోజే ఉతుక్కున్నాక, చిట్టి చేసే పనేమిటంటే— ఒక చెంబునిండా నిప్పులు పోసి, ఆ చెంబును మందమైన గుడ్డతో పట్టుకుని తన చొక్కాలమీదా, పరికిణీల మీదా పామి చలువచేస్తుంది. చలువచేసిన దాని బట్టల్ని సోమన్న కూడా మెచ్చుకుంటాడు.

తల్లి మాత్రం చిట్టి నేనాడూ మెచ్చుకోదు. "దానికి ఆటలధ్యాస ఎక్కువ. నాకేనాడూ పనిలో సాయం చెయ్యదు. అది బట్టల్ని ఎంత బాగా చలువచేస్తే మాత్రం ఎవరిక్కావాలి? అవన్నీ దాని బట్టలేగదా! పొరబాటున కూడా ఇతరుల బట్టలు చలువచెయ్యదు," అంటుందామె.

ఇదంతా తెలిసి, నాయనమ్మ ఒకనాడు చిట్టిని పిలిచి మందలించింది. చిట్టి లెక్క చేయకుండా, "నేను అమ్మకు బోలెడు సాయం చేస్తాను. అమ్మకెంతపని చేసినా తృప్తి వుండదు. ఎంతసేపూ నన్ను తిట్టడమే! చిన్నపిల్లలన్నాక ఆడుకోకుండా ఎలా? అమ్మ నన్ను ఆడుకోవద్దంటుంది. అందుకే అమ్మంటే నాకోపం. అమ్మకే పనీ చేసిపెట్టను," అని చెప్పింది.

కోడల్ని తప్పుపడితే నాయనమ్మకూ ఇష్టమే కదా! అందువల్ల ఆవిడ ఎంతో సంతోషించి, "పోనీలేవే, చిట్టీ! అమ్మకే పనిలోనూ సాయపడకు. మరి ఇతరులకు సాయపడ్డానికేం?" అని అడిగింది.

రాజకుమారి



"నీకేం తెలీదు, నాయనమ్మా! నాన్న గారేమో అస్తమానూ, మా చిట్టి సుకుమారి దానికే పనీ చెప్పకూడదు, అంటారు. ఆయనకేదైనా పనిచేసి పెడితే, నేను సుకుమారిని కాదనుకుంటారని భయం. అన్నయ్యకు పనిచేద్దామంటే, నేను వాడికంటే చిన్నదాన్నా మరి! అయినా సరే వాడు నన్ను ముద్దుగా చూడడు. అన్నింటికీ తనమాటే వినాలంటాడు. వాడికి నేనెందుకు పనిచేయాలి? ఇక చెల్లాయి సంగతి విను, అది నాకంటే చిన్నదేగదా, అయినా పెద్దదాన్నన్న సంగతి మరిచి, నామీద ఏమాత్రం గౌరవం లేకుండా మాట్లాడుతుంది. నేచెప్పిందొక్కటీవినదు. పైగా తను చిన్నపిల్ల కాబట్టి ముద్దుచేయా లంటుంది. నామాట విననప్పుడు, నేను దాన్నెందుకు ముద్దుచేస్తాను? దాని బట్ట లెందుకు చలువచేస్తాను? నువ్వేచెప్పు!" అన్నది చిట్టి.

చిట్టి మాటలకు నాయనమ్మ నవ్వి, "అయితే, నువ్వెవరి పనులూ చేయవన్న మాట. అవునా?" అని అడిగింది.

"ఎందుకు చేయను? నాకైతే నీ బట్టలు చలువ చేయాలనుంటుంది. కానీ, ఏం లాభం? నీకేమో మడి. నీ బట్టలు నువ్వే ఉతికి ఆరేసుకుంటావు. వాటిని చలువచేయడానికి వీల్లేదంటావు," అన్నది చిట్టి.

"అహాఁ, నీవన్నీ మీ తాతయ్య తెలివి తేటలే!" అంటూ నాయనమ్మ చిట్టిని దగ్గిరగా తీసుకుని మురిసిపోయింది.

ఇంతలో చిట్టి అమ్మ అక్కడికి వచ్చి, "సోమన్న ఊళ్ళో లేడట. సాయంత్రం పేరంటానికి వెళ్ళాలి. పట్టుచీర బాగా నలిగిపోయింది. కాస్త చలువచేసి పెట్టమ్మా, చిట్టీ!" అన్నది.

"నేను చెయ్యను," అన్నది చిట్టి పెడసరంగా.

తల్లి చిట్టిని తిట్టసాగింది. అప్పుడు నాయనమ్మ కల్పించుకుని, "దాన్నెందుకే తిడతావు? పిల్లలతోనైనాసరే అవసరం

వున్నప్పుడు, మంచి మాటలాడి పని చేయించుకోవాలి. నువ్వు మరీ పెడసరం మనిషివి!'' అంటూ కోడల్ని మందలించింది.

''మనవరాలుకదా అని వెనకేసుకొచ్చి, దాన్ని పాడుచేయకండి. నేను పెడసరం మనిషినైతే మీరు దానిచేత నాచీర చలువ చేయించండి, చూద్దాం!'' అని సవాలు చేసి చిట్టి అమ్మ అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

నాయనమ్మకు పౌరుషం వచ్చింది. ఆవిడ మనవరాలితో, ''నువ్వు గనక మీ అమ్మ చీర చలువచేశావంటే, నీకు దానిచేతే మంచి పట్టుపరికిణీ కుట్టిస్తాను,'' అన్నది.

''పట్టుపరికిణీయే! అమ్మో! ఎంత గింజుకున్నా అమ్మ అందు కొప్పుకోదు,'' అన్నది చిట్టి.

''ఎందుకొప్పుకోదూ మన బుర్రలో తెలివుంటే ?'' అంటూ నాయనమ్మ చిట్టి కొక ఉపాయం చెప్పింది.

ఈ ఉపాయాన్నెలా అమలు జరపాలో నాయనమ్మా, మనవరాలూ అభ్యాసం చేస్తూండగా, పొరుగింటావిడ వచ్చి, చిట్టి అమ్మను, "పట్టుచీర కొనడానికి బట్టలదుకాణానికి సాయం వస్తావా?'' అని అడిగింది.

ఇందుకు చిట్టి అమ్మ ఆశ్చర్యపోయి, ''ఈ మధ్యనేకదా ఒక పట్టుచీర కొన్నావు. నీకు డబ్బుకానీ ఎక్కువయిందా ఏమిటి ?'' అని అడిగింది.



అందుకు పొరుగింటావిడ నిట్టూర్చి, ''అంతా నా దురదృష్టం. ఈరోజుల్లో పిల్లలు బాగా తెలివి మీరిపోయారని తెలుసుకో లేక పోయాను. మా అమ్మాయి ఎన్నాళ్ళు గానో పట్టుపరికిణీ కావాలని అడుగు తున్నది. ఎదిగే పిల్ల కదా; ఇంకాస్త పెద్దయ్యాక కుట్టించొచ్చులే అనుకుని జాప్యం చేశాను. అదేం చేసిందో తెలుసా? నాకూ బట్టలు చలువచేయడం వచ్చు, నీ చీర చలువచేసి పెడతాను, అని పట్టు చీర తీసుకుని చలువ చేస్తూ చేస్తూ, ఇంత మేర కాల్చేసింది. అది కావాలనే ఆ పని చేసిందని, నా అనుమానం,'' అన్నది బాధగా.

''నీ పట్టుచీర కాల్చితే దానికేం ప్రయోజనం?'' అని ప్రశ్నించింది చిట్టి అమ్మ.

''ప్రయోజనం లేకేం! ఆ పట్టుచీర నేను కట్టుకునేందుకు ఎలాగూ పనికి రాదని, దానితో దానికి రెండు రకాల పట్టుపరికిణీలు కుట్టించాను. ఇప్పుడు నాకేమో పేరంటానికి వెళదామంటే, పట్టు చీర లేకుండా పోయింది,'' అన్నది పొరుగింటావిడ.

చిట్టిఅమ్మ తలాడిస్తూ, ''సరేలే! భోజనాలయ్యాక ఇద్దరం కలిసి బట్టల దుకాణానికి వెళదాం,'' అన్నది.

పొరుగింటావిడ వెళ్ళిపోయింది.

అప్పుడు ముందు చిట్టీ, వెనగ్గా నాయనమ్మా అక్కడికి వచ్చారు. తల్లితో చిట్టి, ''అమ్మా, నేను నీ పట్టుచీర చలువ చేస్తాను,'' అని ఇంకా ఏదో అనబోతూండగా చిట్టి అమ్మ కోపంగా దానివంక చూస్తూ, ''నీ ఎత్తు నాకు తెలిసిపోయిందిలే! నా బట్ట నువ్వు చలువచెయ్యడానికి వీల్లేదు. ఒకవేళ చలువచేసినా సరే, నీకు నేను పట్టుపరికిణీ కుట్టించను. తెలిసిందా?'' అన్నది.

తాము చెప్పకుండానే పట్టుపరికిణీ విషయం, ఆమెకెలా తెలిసిందో అర్థం కాక చిట్టీ, నాయనమ్మ కూడా ఆశ్చర్య పోయారు.





# శ్రీ జగన్నాథ చరిత్ర

విద్యాపతి కొన్ని గంటలు ప్రయాణం చేశాక, అరణ్యం దాటి పచ్చటి మైదానాలను చేరుకున్నాడు. తను వచ్చిన కార్యం సాధించినందుకు సంతోషిస్తూ, చిన్న కొలను గట్టున దిగి, ఒక బండపై కూర్చుని, లలిత కట్టి పంపిన మూట విప్పి, అన్నం తిని చెట్టు కింద కొంత సేపు విశ్రాంతి తీసుకున్నాడు. ఆ తరవాత అరణ్యం కేసి ఒకసారి తిరిగిచూసి, విశ్వావసుకూ, లలితకూ మనసులో క్షమాపణలు చెప్పుకుని, మళ్ళీ గుర్రమెక్కి రాజధానీ నగరం కేసి బయలుదేరాడు.

సాయంకాలానికి అతడు రాజధానీ నగరం చేరుకుని తిన్నగా రాజప్రాసాదానికి వెళ్ళాడు. విద్యాపతిని దూరం నుంచే చూసిన ఒక అధికారి, అతని రాకను రాజుకు ముందుగానే తెలిపాడు. రాజు పరమానందంతో ఎదురువచ్చి, "నీ రాక కోసం ప్రతిక్షణం ఎదురుచూస్తున్నాను. వెళ్ళిన కార్యం జయప్రదమయింది కదా!" అని అడిగాడు.

"నేను అన్వేషిస్తూ వెళ్ళిన దివ్య ప్రతిమను తెచ్చాననే భావిస్తున్నాను. అయినా...." అని ఇంకేదో చెప్పబోయి ఆగిపోయాడు విద్యాపతి.

"సంకోచం లేకుండా చెప్పు నాయనా. జీవితంలో గొప్ప కార్యాలు సాధించాలంటే అవరోధాలూ, అటంకాలూ తప్పవు. ఈ మహాకార్యం సాధించడానికి నీకు ఎదురైన సమస్య ఏమిటి? చెప్పు,

3. విగ్రహప్రతిష్ఠాపన



పరిష్కరించడానికి ప్రయత్నిస్తాను,'' అన్నాడు రాజు.

''నా బాధను ఎవరూ తీర్చలేరు ప్రభూ. నేను అన్వేషిస్తూ వెళ్ళిన దివ్య వస్తువును దొంగిలించుకుని వచ్చాను. అదీ, నన్నెంతగానో ఆదరించి, తన ఏకైక కుమార్తె నిచ్చి వివాహం చేసిన పుణ్య మూర్తికి తెలియకుండా ఆ వస్తువును తెచ్చాను. నేను చేసిన దుష్కృత్యం రేపు వేకువజామునే వారి దృష్టికి రాగలదు. అప్పుడు వాళ్ళెంతగా తల్లడిల్లిపోతారో అని విచారంగా వున్నది!'' అన్నాడు విద్యాపతి.

''నువ్వీక్షణం నుంచే ఇలాంటి ఆలోచనలను వదిలిపెట్టాలి. ఎందుకంటే, మన దేవాలయ నిర్మాణానికి దూరతీరాలనుంచి వచ్చిన వేలాదిమంది శిల్పులు, రేయింబవళ్ళు తమ శ్రమను ధారపోశారు. మనమూ దీనికెంతో ధనం వెచ్చించాము; పాటుపడ్డాము. లోకక్షేమం కోసం ఈ దైవ కార్యం పూర్తికావడానికి ఇంకొకరు వేరొకదాన్ని కోల్పోవడంలో ఆశ్చర్యం లేదు. అందుకు బాధపడవలసిన అవసరం లేదు! పైగా, సముద్రంలో ఒక దుంగ కొట్టుకువస్తున్నట్టు, నాకు కలద్వారా దివ్య సందేశం అందింది. ఆ దుంగతో దైవరూపాన్ని చెక్కి, దాని లోపల నువ్వు తెచ్చిన దివ్యప్రతిమను భద్రపరచి ఆలయంలో ప్రతిష్ఠిద్దాం. దానిని దర్శించడానికి, నీకు ఆతిథ్యమిచ్చిన ఆ మహానుభావుడు కూడా ఆనందించగలడు?'' అంటూ రాజు విద్యాపతిని ఓదార్చాడు.

మరునాడు సూర్యోదయానికి ఒక గంట ముందే విద్యాపతితో సహా రాజు, తన పరివారంతో బయలుదేరి సముద్రతీరం చేరాడు. సరిగ్గా సూర్యోదయ సమయానికి, ''అదిగో కనిపిస్తున్నది కదా! అలల మీద తేలుతూ వస్తున్నది చూడండి!'' అని అన్నాడు రాజు పట్టరాని ఉత్సాహంతో.

''అవునవును, కనిపిస్తున్నది గుండ్రటి పొడవాటి దుంగ!'' అన్నారు మంత్రితో సహా అక్కడివారందరూ.




మరుక్షణమే, అక్కడే సిద్ధంగా వున్న పది పడవలు, సముద్రంలోకి ప్రవేశిం చాయి. పడవలలోని మనుషులు దుంగను సమీపించి దానిని తీరం కేసి నెట్టడానికి ప్రయత్నించారు. కాని, అది కదలలేదు. ఆశ్చర్యంతో, కొందరు ఈతగాళ్ళు పడవలనుంచి నీళ్ళలోకి దూకి దుంగను ముందుకు తోశారు. కాని, అది ఏమాత్రం కదలలేదు. పడవలతో నెట్టి చూశారు. ప్రయోజనం కనిపించలేదు. దుంగకు తాళ్ళను బిగించి, పెద్దపెద్ద పడవల నుంచి గట్టుకేసి లాగారు. దుంగ ఒక్క అంగుళం కూడా ముందుకు సాగలేదు.

ఈ పరిస్థితిని చూసి రాజు విచారం చెందాడు. విద్యాపతికి గానీ, మంత్రులకు గానీ ఏమి చేయడానికీ తోచలేదు. అలలపై బెండులా తేలే దుంగ ఇలా కొండలాగా కదలకపోవడమేమిటి? దీనిని తీరానికి చేర్చకుండా వెనుదిరగడం లేదు—అన్న పట్టుదలతో రాజు అక్కడే వుండిపోయాడు.

సాయంకాలమై రాత్రి అయింది. బంగారు పల్లకీలో రాణి గుండిచాదేవి సముద్రతీరానికి వచ్చి రాజుతో, "ప్రభూ, తెల్లవారేవరకూ ఇక్కడే వుండి పోతారా!" అని అడిగింది.

"ఏమి చేయడానికీ తోచడం లేదు రాణీ," అంటూ రాజు కళ్ళు మూసుకుని ఒక్క క్షణం ఆలోచించి, "ఆపండి!" అన్నాడు సముద్రం కేసి చూస్తూ. ఆ తర వాత విద్యాపతిని దగ్గరికి పిలిచి, "దుంగ ఎందుకు కదలడం లేదో ఇప్పుడు నా కర్థ మయింది. నువ్వు తీసుకువచ్చిన దివ్య ప్రతిమను, ఇంత కాలం అరణ్యంలో పూజిస్తూ వచ్చిన మహానుభావుడివద్దకు నన్ను తీసుకుపో!" అన్నాడు.

విద్యాపతి దారి చూపగా, మంత్రి దండనాథులు వెంటరాగా రాజు, అరణ్య మధ్యంలోని కోయదొర విశ్వావసు గూడెం కేసి బయలుదేరాడు. మరునాడు మధ్యాన్నానికి వారు, కోయగూడేన్ని అనుకునివున్న కొండమీదికి చేరారు.



అ కోయగూడెం ఎప్పుడూ ప్రశాంతం గానే వుండేది. కాని, నిన్న ఉదయం నుంచి అది మరింత ప్రశాంతంగా, విషా దంతో నిండివున్నది. రోజూలాగే వేకువ జామున ఇల్లువదలి వెళ్ళిన విశ్వావసు కొంతసేపటికల్లా తిరిగి వచ్చి కూతురితో, "నీ భర్త ఎంతపని చేశాడు తల్లీ!" అని అంటూ వాకిట్లో పడి మూర్ఛపోయాడు. లలిత భయపడిపోయింది. బంధువులు విశ్వావసును ఇంటి లోపలికి చేర్చి ముఖం మీద నీళ్ళు చిలకరించారు. ఆయన మెల్లగా కళ్ళు తెరిచి, చుట్టుపక్కల కలయజూసి, మళ్ళీ బాధగా కళ్ళు మూసుకున్నాడు.

జరిగిన సంగతి లలితకు అర్థమయింది. తరతరాలుగా పూజిస్తూ వచ్చిన దివ్య ప్రతిమను విద్యాపతి అపహరించుకు పోవడంవల్లే తన తండ్రి ఇలా దిగ్భ్రాంతికి లోనై, శోకమూర్తి అయ్యాడని ఆమె గ్రహించింది. విద్యాపతి తన నెంతగానో అభిమానించినప్పటికీ, అతడు అడవిలో తమతో గడపడానికి, అభిమానం ఒక్కటే కారణం కాదనీ, మరేదో సాధించడానికే అతడు తమతో గడిపాడని ఆమె అనుకున్నది.

ఆ పగలూ, రాత్రీ విశ్వావసు మూసిన కళ్ళు తెరవలేదు. లలిత నిద్రాహారాలు మాని తండ్రి పక్కనే కూర్చున్నది. మర్నాడు వేకువజామున విశ్వావసు యథాప్రకారం గుహకేసి నడిచాడు. ఆయన వెంట లలిత, ఇతర బంధుగణం బయలుదేరారు. విశ్వావసు గుహ లోపలికి వెళ్ళి, రాతిపీఠాన్ని కౌగిలించుకుని విలపించసాగాడు. అందరూ ఎంత వేడుకున్నప్పటికి ఆయన అక్కడ నుంచి లేవడానికి ఒప్పుకోలేదు.

మధ్యాన్న సమయానికి, ఒక కోయ యువకుడు గుహకేసి పరిగెత్తుకుంటూ వచ్చి, "కొండపై నుంచి కొందరు మన గూడెం కేసి వస్తున్నారు. వాళ్ళలో రాజు కూడా ఉన్నాడు!" అని చెప్పాడు.

మరి కొంతసేపటికి మరొక యువకుడు పరిగెత్తుకువచ్చి, "వాళ్ళలో విద్యాపతి కూడా వున్నాడు!" అని చెప్పాడు.

"అహం, మనవద్ద వున్నదివ్యప్రతిమను అపహరించుకు పోయినప్పటికీ తృప్తి కలుగలేదన్నమాట! ఇప్పుడు మనకున్న దంతా దోచుకుపోవడానికి వస్తున్నట్టుంది!" అన్నాడు ఒక మధ్యవయస్కుడు.

"కాదు, కాదు. వస్తున్న వారెవరివద్దా ఆయుధాలు లేవంటున్నారుకదా! మన దొరను పరామర్శించడానికే, రాజుగారు వస్తున్నారు!" అన్నాడు ఒక వృద్ధుడు.



విశ్వావసు లేచి గుహ నుంచి వెలుపలికి వచ్చి, చేతులు జోడించి నిలబడ్డాడు. రాజు వచ్చీరాగానే, ఆయన్ను అమాంతం కౌగిలించుకుని, "మహాత్మా, అసలు దొంగను నేను; నీ అల్లుడు కాదు. నన్ను క్షమించు," అన్నాడు.

విశ్వావసు కన్నీళ్ళు తుడుచుకుంటూ, రాజుకు, పక్కనే వున్న ఒక బండను చూపాడు. రాజు దాని మీద కూర్చుని, "విశ్వావసూ, నేను చెప్పేదంతా దయతో విను," అంటూ, దైవప్రేరణతో తను పూరీ సముద్రతీరంలో ఆలయం నిర్మించిన విధమూ, ఆలయంలో ప్రతిష్ఠించడానికి విగ్రహం కోసం పండితులను పంపిన సంగతీ, విద్యాపతి చేసినపనీ వివరించి, "విశ్వావసూ, ఇన్ని తరాలుగా ఆ దేవుడు మీ వంశస్థుల పూజలందుకున్నాడు. ఇక మీదట భక్తులందరి పూజలూ అందుకోవాలన్నది భగవత్సంకల్పం. ఆ దివ్యప్రతిమను దుంగతోచేసే విగ్రహం లోపల భద్రపరుస్తున్నాము. అందుకు నీ అనుమతిని అర్థిస్తున్నాను," అన్నాడు.

విశ్వావసు మౌనంగా తలాడించాడు. ఆ తరవాత రాజు మళ్ళీ, సముద్రం అలలపై తేలుతూన్న దుంగ, తీరం కేసి కదలకపోవడం గురించి చెప్పి, "భక్తుడయిన నీ అధ్వర్యంలోనే విగ్రహ ప్రతిష్ఠాపన జరగాలన్నది దైవసంకల్పం. కాబట్టి నువ్వు మా వెంట వచ్చి, దుంగను తాకి



దైవకార్యం నిర్విఘ్నంగా పూర్తి చేయడానికి సాయపడాలి!'' అన్నాడు.

విశ్వావసు కొంతసేపు మౌనం వహించి, ''మీ అజ్ఞానుసారం మీ వెంట రావడానికి సిద్ధంగా వున్నాను,'' అన్నాడు.

రాజు పరమానందంతో ఆనంద బాష్పాలు రాలుస్తూ విశ్వావసును మళ్ళీ ఒకసారి కౌగిలించుకుని, పక్కనే వున్న లలిత కేసి తిరిగి, ''తల్లీ, నీ భర్తను అపార్థం చేసుకోవద్దు. మహోన్నత కార్యం సాధించడానికే అతడు నీ నుంచి రహస్యాన్ని దాచాడు,'' అన్నాడు.

పక్కనే వున్న విద్యాపతి, ''నీకు తెలియకుండా, నా కర్తవ్యం నెరవేర్చినందుకు నన్ను క్షమించు. త్వరలో వచ్చి నిన్ను రాజధానికి వెంటబెట్టుకుని వెళతాను, అంతవరకు ఓర్పువహించు,''అన్నాడు లలితతో.

నీళ్ళునిండిన కళ్ళతో లలిత విద్యాపతిని చూసింది.

మరునాడు సాయంకాలానికి రాజు తన పరివారంతో సముద్రతీరం చేరుకున్నాడు. విశ్వావసు పడవపై సముద్రంలోకి వెళ్ళి దుంగను తాకాడు. మరుక్షణమే ఆ దుంగ అలలపై తేలుతూ తీరానికి చేరింది. రాజభటులు దానిని రాజభవనానికి చేర్చారు.

తెల్లవారగానే రాజు, ఆస్థాన శిల్పులనూ, శిల్పాచార్యులనూ పిలిపించి, ''ఈ దుంగతో ఏ దైవవిగ్రహం చెక్కితే మంచిది?'' అని అడిగాడు.

అందుకు శిల్పులు, ''శిలలను దైవ విగ్రహాలుగా చెక్కడం మాకు తెలిసిన విద్య. అయితే, దుంగతో విగ్రహాలు రూపొందించడం అన్నది మాకు అనుభవం లేనిది!'' అన్నారు వినయంగా.

సరిగ్గా ఆ సమయానికి అక్కడికి ఒక వృద్ధుడు వచ్చి, ''రాజా, మీరు నిర్మించిన ఆలయంలో అన్నా చెల్లెళ్ళయిన బలభద్ర, సుభద్రలతో కలిసి శ్రీ కృష్ణరూపంలో కొలువు తీరాలన్నది భగవత్సంకల్పం! తమరు అనుమతించారంటే ఈ దుంగతో నేనా విగ్రహాలను రూపొందించగలను.

అయితే, ఒక విన్నపం. కావలసిన పని ముట్లతో ఈ దుంగతోపాటు నేను ఏకాంత స్థలంలోకి వెళ్ళి తలుపులు మూసుకుంటాను. విగ్రహాల రూపకల్పన పూర్తయ్యాక నేనే తలుపులు తెరుచుకుని వస్తాను. ఈలోగా మధ్యలో ఎవరుగాని నన్ను పిలువకూడదు,'' అన్నాడు వృద్ధుడు.

''మరి మీ ఆహారం మాటేమిటి?'' అని అడిగాడు రాజు.

''పని పూర్తయ్యాక తీసుకుంటాను!'' అన్నాడు వృద్ధుడు.

రాజు అందుకు అంగీకరించి, రాజ భవనంలోనే ఒక విశాలమైన గదిని వృద్ధ శిల్పికి ఏర్పాటు చేశాడు. వృద్ధుడు దుంగతోసహా ఆ గదిలో ప్రవేశించి తలుపులు మూసుకున్నాడు. వెలుపలినుంచి తలుపుకు చెవి ఆనించి వింటే సుత్తి, ఉలి చప్పుళ్ళు వినిపించేవి. రాణి గుండిచాదేవి ఉత్సాహం కొద్దీ తరచూ అలా వినేది. కొన్నాళ్ళు గడిచింది. ఒక నాడు చప్పుడు వినిపించలేదు. మర్నాడు కూడా శబ్దం రాలేదు. అన్నపానీయాలు లేక వృద్ధుడికి ఏమయిందోనన్న అనుమానం కొద్దీ రాణి తలుపు తెరిచి చూసింది.

దీక్షతో విగ్రహాలు రూపొందిస్తూన్న శిల్పి, ఆమె కేసి తలెత్తిచూసి ఆ క్షణమే అంతర్థానమయ్యాడు. విగ్రహాలు అసంపూర్తిగా మిగిలిపోయాయి. దేవశిల్పి విశ్వకర్మ, వృద్ధశిల్పిరూపంలో వచ్చాడని అందరూ భావించారు. తను చేసిన పనికి రాణి బాధపడింది. కాని, అంతా దైవ నిర్ణయం అని భావించిన రాజు, విద్యాపతి తెచ్చిన దివ్యప్రతిమను కృష్ణవిగ్రహంలో రహస్యంగా భద్రపరచి, లోకకల్యాణం కాంక్షించి, కృష్ణవిగ్రహంతోపాటు బలభద్ర, సుభద్ర విగ్రహాలను కూడా ఆలయంలో ప్రతిష్ఠించాడు. విద్యాపతి వంశస్థులను ఆలయ పూజారులుగా నియమించాడు. ఆనాటి నుంచి పూరీ శ్రీజగన్నాథ మందిరం మనదేశంలోని విష్ణు క్షేత్రాలలో ముఖ్యమైనదిగా వెలుగొందుతున్నది. —(అయిపోయింది)







# మహామేధావి!

పూర్వం స్పెయిన్‌దేశంలో, పెడ్రోశాన్‌కాజ్ అనే తెలివైన యువకుడొకడుండేవాడు. ఆ దేశంలో సాహసవంతులైనవాళ్ళు, అబోతుల్లా బలిసిన ఎద్దులతో పోరాడి ప్రేక్షకులకు వినోదం కలిగించేవాళ్ళు. అయితే, ఆ ఎద్దులను ముందుగా రెచ్చగొట్టేందుకు, కొందరు యువకులు వాటిని ఈటెలతో పొడిచేవాళ్ళు. ఆ సమయంలో అవి కోపంతో బుసలుకొడుతూ వెంటబడితే, దాపులనున్న ఏ గోడ మీదికో, చెట్టు కొమ్మల్లోకో ఎగిరి, ప్రాణాలు కాపాడుకునేవాళ్ళు. అలాంటి యువకుల్లో పెడ్రోశాన్‌కాజ్ మంచి ఒడుపూ, నేర్పూ గలవాడు. ఆ కారణంగా అందరూ వాణ్ణి తెలివైనకోతి అని పిలిచేవాళ్ళు.

శాన్‌కాజ్‌కు ప్రపంచంలోని అన్ని దేశాలూ తిరిగి, అక్కడి వింతలూ విచిత్రాలూ చూడాలనే బలమైన కోరిక వుండేది. వాడికి అనుకోకుండా ఒక నావికుడు స్నేహితుడయ్యాడు. శాన్‌కాజ్, అతడి వెంట బయలుదేరి, కొన్నాళ్ళకు చీనాదేశం చేరుకున్నాడు.

ఆ రోజుల్లో చీనాదేశాన్ని ఒక మహారాణి పరిపాలిస్తూండేది. నిండుగా నిగనిగలాడుతూండే ఆమె శిరోజాల్లో, ఒకనాడు వెండి తీగలాంటి శిరోజం ఒకటి దర్శనమిచ్చింది.

రాణి చెలికత్తెలు తెలివిగా ఆమెతో, ''మహారాణీ, రాత్రి తమకు దేవుడొక అందమైన వెండితీగెను ప్రసాదించాడు!'' అన్నారు.

రాణి అద్దంలో చూసుకుని వెండి తీగెలా మెరిసిపోతున్న శిరోజం కంటబడగానే ఆశ్చర్యపోయి, కొంచెంసేపు ఆలోచించి, జ్యోతిష్కులకోసం కబురు పంపింది.

స్పెయిన్ జానపద కథ



జ్యోతిష్కులు వచ్చి సంగతి విని, ''తుమ్మెద రెక్కల్లాంటి తమ శిరోజాల్లో, ఈ వెండితీగ ప్రవేశం స్వల్పవిషయం ఏమీ కాదు!'' అంటూ తాళపత్ర గ్రంథాలెన్నో పరిశీలించి, నిర్ఘాంతపోతూ ఆమె కేసి చూశారు.

రాణీ ఇది చూసి బెదిరిపోయి, ''ఇంతకూ, దీని ఫలితం ఏమిటి?'' అని అడిగింది.

''అరిష్టం, మహారాణీ! మహారిష్టం! తమకేదో గొప్పకీడు రానున్న సూచన అది,'' అన్నారు జ్యోతిష్కులు.

''మరి, నివారణోపాయం ఏమిటి?'' అని అడిగింది రాణి దిగులుగా.

''దానికి నివారణోపాయం ఏమిటో, ఈ జ్యోతిషగ్రంథాల్లో లేదు,'' అన్నారు జ్యోతిష్కులు.

అయితే, ఒక యువజ్యోతిష్కుడు మాత్రం, ''మహారాణీ, సూచనప్రాయంగా నాకొక సంగతి తెలుస్తున్నది. కాని ఆ సంగతి చెప్పడానికి విచారంగా వున్నది,'' అన్నాడు.

''తర్వాత విచారించుదువుగాని, ముందు సంగతి చెప్పు!'' అన్నది రాణి కోపంగా.

''మీ శిరోజాల్లో వెండితీగ రూపంలో ప్రవేశించిన, ఆ దుష్టశక్తి కారణంగా, త్వరలోనే తమకు పంటినొప్పి రానున్నది!" అన్నాడు యువ జ్యోతిష్కుడు కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

రాణీ కూడా వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ, యువజ్యోతిష్కుడికి తన మెడలోని రత్నహారాన్ని బహూకరించి, పంపేసింది.

సరిగ్గా ఇలాంటి సమయంలోనే శాన్‌కాజ్, రాజధానీనగరంలో అడుగు పెట్టాడు. వాడు రాజప్రాసాదం ముందుగా పోతూండగా, రాణీగారికి పంటినొప్పి రానున్నదనే దిగులుతో, ఆవిడ పరివారమంతా, ''అయ్యో! అయ్యో!'' అంటూ కేకలు ప్రారంభించారు.

ఏదో పరాకుగా దారివెంట పోతున్న శాన్‌కాజ్, ఆ కేకలు విని ఏదో రెచ్చి పోయిన ఎద్దు తనపైకి వస్తున్నదని భ్రమ పడి, దాపులనున్న రాజభవనం కిటికీ మీదికి ఎగిరి నుంచున్నాడు. అక్కడ కాపలా వున్న భటుడు, శాన్‌కాజ్ మెడ పట్టుకుని మహామంత్రి దగ్గిరకు లాక్కు పోయాడు.

ఈ మంత్రికి కొన్ని విదేశభాషలు అంతో యింతో తెలుసు. ఆయన శాన్‌కాజ్‌ను, "ఏ దేశం వాడివి? పేరేమిటి? వృత్తే మిటి?" అని ప్రశ్నించాడు.

శాన్‌కాజ్ భయంతో వణుకుతూ, మంత్రి ప్రశ్నలన్నిటికీ జవాబుగా, "తెలివైన కోతిపని!" అనేశాడు.

తెలివైన అనే మాటనుబట్టి, ఈ యువకుడు తెలివైనవాడన్న నిర్ణయానికి వచ్చిన మంత్రి, "అలాగా! నువ్వు తెలివిగా, మా మహారాణికి వచ్చిపడ్డ ఆపద తీర్చ గలవా?" అని అడిగాడు.

"ఆ ఆపద ఏమిటి?" అన్నాడు శాన్‌కాజ్ ఆశ్చర్యంగా. మంత్రి సంగ తేమిటో వివరించాడు. శాన్‌కాజ్ గట్టిగా చిటికెలువేసి, "ఇలాంటి ఆపదలను క్షణాలలో ఉఫ్ అంటూ ఊదేయగలను!" అన్నాడు.

ఆ జవాబుకు మంత్రి గొప్పగా సంతోషించి, నౌకర్లను, శాన్‌కాజ్‌కు స్నానం చేయించి, పట్టువస్త్రాలు కట్టబెట్టి తక్షణం తీసుకురమ్మన్నాడు. వాళ్ళలాగే చేశారు.





మంటున్నారు ?'' అని అడిగాడు మెల్లగా తలపైకెత్తుతూ.

''తల ఎత్తకు, అలాగే వుండు. తల ఎత్తితే శిరశ్ఛేదం తప్పదు! అంటున్నారు మహారాణిగారు,'' అని మంత్రి జవాబు ఇచ్చాడు.

రాణీ, మంత్రిని, ''తెలివైన మహా మేధావి ఏమంటున్నాడు?" అని అడిగింది.

''తమకు రాబోయే అరిష్టాన్ని క్షణంలో నివారిస్తానంటున్నాడు, మహారాణీ!'' అన్నాడు మంత్రి.

రాణి చాలా సంతోషించి, అదేదో తక్షణం చేయమన్నది. మంత్రి నుంచి రాణి అన్నదేమిటో వినగానే శాన్‌కాజ్ లేచి నిలబడ్డాడు. మృదువుగా, రాణి శిరోజాలలో వున్న తెల్లవెంట్రుకను లాగివేశాడు. అలా చేసేటప్పుడు తన భాషలో వున్న ఏవో మంత్రాలను పెద్దగా పఠించాడు. అ తర్వాత రాణికి రానున్న మహా అరిష్టం తొలిగిపోయినట్టు మంత్రికి చెప్పాడు.

మంత్రి చీనాభాషలో, ఈ సంగతి రాణికి చెప్పగానే, అమె మహానందంగా, ''మహామంత్రీ, ఇంత గొప్ప మేధావిని మనం వదులుకోకూడదు. మన దేశానికి, ఈ రోజు నుంచీ ఈ యువమేధావి మహామంత్రి. ఇంతటితో మీ మంత్రిత్వం

మంత్రి, శాన్‌కాజ్‌ను వెంటబెట్టుకుని రాణి దగ్గిరకు పోయి, ''మహారాణీ, ఈ యువకుడు ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన తెలివిగలవాడు! ఒక పెనుభూతం ఆవహించిన సుడిగాలొకటి ఇతణ్ణి సప్త సముద్రాల మీదుగా మోసుకువచ్చి, మన రాజధానీ నగరంలో పడవేసింది. ఇది మన అదృష్టం!'' అని చెప్పాడు.

ఆ సమయంలో శాన్‌కాజ్, రాణికి సాష్టాంగపడి వున్నాడు, రాణి అతడితో, ''ప్రపంచప్రసిద్ధమేధావీ, లేచినిలబడు!'' అన్నది.

ఆమె మాట్లాడిన భాష తెలియక శాన్‌కాజ్, మంత్రిని, ''మహారాణిగారే

ముగిసింది కాబట్టి, ఆచారం ప్రకారం మీ ఉరి వైభవ శుభకార్యం ఏర్పాటు చేయించండి. మీ ఆత్మశాంతికి పదివేల మంది పూజారులతో పూజలు ప్రారంభింప చేయండి,'' అన్నది.

ఈ మాటలు వినగానే మంత్రికి ముచ్చె మటలు పోశాయి. శాన్‌కాజ్, మంత్రిని, ''మహారాణిగారేమంటున్నారు ?'' అని అడిగాడు.

రాజవంశపు ఆచారం ప్రకారం, కొత్త ప్రధానమంత్రిని నియమించినప్పుడు, పాతమంత్రికి ఉరిశిక్ష విధిస్తారనీ, అందు వల్ల తనకు మరణం తప్పదనీ, మంత్రి చెప్పాడు.

శాన్‌కాజ్ కొంచెంసేపు ఆలోచించి, ''మహామంత్రీ, దిగులుపడకు ! నేను రాణీగారు యివ్వజూపిన మహామంత్రి పదవిని అంగీకరించాలంటే, ఆమె మిమ్మల్ని నాకు సహాయకులుగా యివ్వాలి. ఈ సంగతి మీరు, మహారాణికి చెప్పండి,'' అన్నాడు.

ఇది వింటూనే మంత్రికి ప్రాణం లేచి వచ్చినట్టయింది.

ఆయన రాణీకి, శాన్‌కాజ్ అభిప్రాయ మేమిటో వివరించాడు.

రాణి వెంటనే, ''అలాగా ! ఈ మహా మేధావి అభిప్రాయాలకు గొప్ప విలువా, గౌరవం వుంటుందని, నాకు తెలుసు. ఉరివిషయంలో మహాఘనత వహించిన, మా రాజకుటుంబపు ఆచారాలనూ, సంప్రదాయాలనూ రద్దు చేస్తున్నాం,'' అన్నది.

''మహాప్రసాదం !'' అంటూ పాత మహామంత్రి, రాణీకి సాష్టాంగనమస్కారం చేశాడు.

ఈ విధంగా పెద్రో శాన్‌కాజ్ మహా మంత్రి కావడమే కాక, త్వరలోనే చీనా భాష నేర్చుకుని, పెళ్ళీడుకు వచ్చిన పాత మంత్రి ఏకైక కుమార్తెను వివాహ మాడి, మహా మేధావిగా అందరిచేతా కీర్తింపబడుతూ, చాలాకాలం సుఖంగా జీవించాడు.



# వ్యాపారరహస్యం

ధర్మయ్య అనే వ్యాపారి చాలా ఏళ్ళపాటు నేతివ్యాపారం చేసి, బాగా డబ్బు గడించాడు. ఆయన చనిపోయేముందు కొడుకు లిద్దరితో, "అన్యాయానికి, అవినీతికి పాలుబడకుండా, వ్యాపారం చేయండి. అనుభవం ద్వారా మీరే వ్యాపారాభివృద్ధికి, ఎలాంటి మెలుకువలు అవసరమో తెలుసుకోగలుగుతారు," అని చెప్పాడు.

తండ్రి పోయాక పెద్దవాడు రామయ్య, చిన్నవాడు కృష్ణయ్య నేతివ్యాపారం ప్రారంభించారు. కొద్దికాలంలోనే కృష్ణయ్య వ్యాపారం బాగా పుంజుకున్నది. రోజూ డబ్బాలకు డబ్బాలు నెయ్యి అమ్ముడు కాసాగింది. అయితే రామయ్య పరిస్థితి ఇందుకు భిన్నంగా తయారైంది. అతడి దుకాణంలో నెయ్యి కొనేవారి సంఖ్య రోజురోజుకూ తగ్గసాగింది.

ఒక రోజున రామయ్య, కృష్ణయ్య అంగడికి వచ్చి, "తమ్ముడూ, మనిద్దరం ఒకే నాణ్యత గల నెయ్యి అమ్ముతున్నాం గదా! అయినా, నీ దుకాణంలో ఎక్కువమంది నెయ్యి కొంటున్నారు. నీ దుకాణం కేసి ఖాతాదార్లను ఆకర్షించడానికి మంత్రం లాంటిదేమైనా ప్రయోగిస్తున్నావేమిటి?" అని అడిగాడు.

ఇందుకు కృష్ణయ్య చిన్నగా నవ్వి, "మంత్రమూ లేదు, తంత్రమూ లేదు!" అని అన్నకు గల్లాపెట్టెపక్కనే వున్న నేతి డబ్బాలను చూపించాడు. వాటిమీద ధర ముప్పై రూపాయులని చీట్లు అంటించి వున్నవి.

"ఇదేమిటి? ఇరవైతొమ్మిది రూపాయుల నెయ్యిని ముప్పైరూపాయలకు అమ్ముతున్నావు. అన్యాయం కదా!" అంటూ రామయ్య ఆశ్చర్యంగా తమ్ముణ్ణి ప్రశ్నించాడు.

"అదేం లేదు! నువ్వు అమ్ముతున్న నెయ్యికన్నా నా దగ్గరవున్న నెయ్యి ధర ఒక రూపాయి ఎక్కువ కావడంతో ఖాతాదార్లు మాత్రం ఇది మరింత నాణ్యత గలదనుకుంటూ కొనుక్కుపోతున్నారు. అంతే కాక, నా నిజాయితీని మెచ్చుకుంటున్నారు కూడా," అని చెప్పాడు.

—జి. సి. జీవి






# కొత్త అమల్దారు

కర్ణాటకదేశాన్ని పాలించిన చాముండ రాయల వద్ద గుండప్ప అనే పురోహితుడుండేవాడు. రాజకుటుంబం జరిపే పూజావిధులన్నిటినీ గుండప్ప సమర్థతతో జరిపిస్తూ ఉండేవాడు.

ఒకనాడు చాముండరాయలు గుండప్పతో, "ఏమయ్యా, నీవు ఇంతకాలంగా మాకు పురోహితుడివిగా ఉండి వైదిక కర్మలన్నీ ఎంతో చక్కగా జరిపిస్తున్నావు. నాకు సంతోషమయింది. నీ మనసులో ఏదైనా కోరిక ఉంటే చెప్పు, నేను తీరుస్తాను," అన్నాడు.

వెంటనే గుండప్ప, "మహారాజా, నాకు వేరే కోరిక లేదుగాని, తమ రాజ్యంలో ఏదన్నా ఒక జిల్లాకు నన్ను అమల్దారుగా వేసినట్టయితే ప్రజల మీద పెత్తందారీ చెయ్యాలని ఉన్నది. అనుకూలమైన పక్షంలో నా కోర్కె తీర్చండి," అన్నాడు.

"అలాగే కానీ," అన్నాడు రాజు చాలా సంతోషంగా.

ఆ సమయంలో దేవగిరి జిల్లాకు అమల్దారును నియమించవలసిన అవసరం ఏర్పడి ఉన్నది. ఆ ఖాళీలో గుండప్పను నియోగించాడు రాజు.

గొప్ప జ్ఞాని అయిన వాడు గనక తన పురోహితుడు ఆ అమల్దారు పదవిని మరింత శక్తివంతంగా నిర్వహిస్తాడని రాజు ఆశించాడు.

అయినా గుండప్ప రాజకుటుంబానికి పౌరోహిత్యం చేశాడేగాని అధికారంతో కూడిన ప్రభుత్వోద్యోగం చేసినవాడు కాడు. అందుచేత ఎందుకయినా మంచిదని ఆయనకు రాజు కొన్ని సూచనలు చేశాడు. అవి ఏవంటే:

అమల్దారు అయినవాడు ఎప్పుడూ ముఖం మాడ్చుకుని ఉండాలి. (అనగా,



నవ్వుతూ ఉల్లాసంగా ప్రజలకు కనపడరాదని భావం.)

అందరి చెవులూ కొరకాలి. (అంటే ఎవరితో మాట్లాడినప్పుడైనా మూడోవాడికి వినిపించకుండా రహస్య సంభాషణ చెయ్యాలని భావం.)

అందరి జుట్టూ చేతిలో, ఉంచుకోవాలి. (అందరి లోపాలూ తెలుసుకుని ఉంచుకుని వాళ్ళు తోక ఝాడించటానికి లేకుండా చూసుకోవాలని అర్థం.)

రాజు తనకు సంగ్రహంగా చేసిన ఈ మూడు సూచనలనూ గుండప్ప శ్రద్ధగా ఆలకించి, ''మహారాజా, అర్థమయింది! గ్రహించాను!'' అన్నాడు.

తరవాత ఆయన రాజుగారి వద్ద ఉద్యోగపత్రం పుచ్చుకుని, వస్తానని చెప్పి సెలవు తీసుకుని, పుట్టెడు సంతోషంతో ఇంటికి వచ్చేశాడు. గుండప్ప ఇంటికి వెళ్ళగానే రాజు దేవగిరికి కొత్త అమల్దారు వస్తున్నట్టు వార్త పంపాడు.

కొత్త అధికారికి స్వాగతం చెప్పటానికి దేవగిరిలోని రాజోద్యోగులు పెద్ద ఎత్తున ప్రయత్నాలు చేసి నగరం వెలపల అతడి కోసం కాచుకుని ఉన్నారు.

ఈలోపల గుండప్ప తన ప్రయాణానికి ఒక మూట సిద్ధం చేసుకున్నాడు. అందులో ఆరుమూళ్ళ పంచెలూ, పన్నెండుమూళ్ళ పంచెలూ కట్టుకుని, ఆ మూటను నెత్తిన పెట్టుకుని, తెల్లవారు గట్టనే బయలుదేరి కాలినడకను దేవగిరి దారి పుచ్చుకున్నాడు.

అప్పటికి అపరాహ్ణమయింది. కొత్త అమల్దారుకు స్వాగతం చెప్పవచ్చిన వారందరూ తిండీ తిప్పలూ లేకుండా నగరం ద్వారం వద్ద వేచి ఉన్నారు.

అమల్దారుగారి కింది అధికారి గుండప్పను సమీపించి, ''అయ్యా, అమల్దారుగారి కోసం ఎదురు చూస్తున్నాం. వారి సమాచారం తమకేమైనా తెలుసునా?'' అని అడిగాడు.

వెంటనే గుండప్ప నెత్తి మీది నుంచి మూట దించి, తన ధోవతి కొంగుకు కట్టి

బొడ్డులో దోపుకున్న అధికార పత్రాన్ని తీసి తన కింది అధికారి చేతిలో ఉంచాడు.

ఇటువంటివాణ్ణి అమల్దారుగా నియోగించారేమిటా అని ఉద్యోగులందరూ విస్మయం చెందారు. అయినా అధికార పత్రం ప్రకారం ఆయన తమ అమల్దారు గనక, గుండప్పను మేళతాళాలతో నగరంలోకి ఊరేగించుతూ తీసుకుపోయారు.



గుండప్పను ఆయన కింది అధికారి తన ఇంటికి తీసుకుపోయి భోజనం పెట్టాడు. పొద్దుటి నుంచీ పచ్చి మంచి నీళ్ళు కూడా తాగకుండా ఉండిన గుండప్ప సుష్టుగా భోజనం చేసి, "తాంబూలం ఏదీ?" అని అడిగాడు.

అధికారి తాంబూలం తెప్పించాడు. "మరి దక్షిణో?" అని అడిగాడు గుండప్ప ఉత్సాహంగా.

గుండప్ప పురోహితుడనీ, దక్షిణ తాంబూలాలు అడిగి పుచ్చుకోవటం ఆయన ఆచారమనీ అధికారికి తెలియదు. కొత్త అమల్దారు తనను అప్పుడే లంచం అడుగుతున్నాడని ఊహించుకుని, ఒక సంచీలో అయిదు వందల మొహరీలు పోసి తెచ్చి గుండప్పకు ఇచ్చుకున్నాడు. ఏ రూపాయో, రెండో ముట్టుతుందనుకున్న గుండప్ప సంచీ విప్పి చూసి నిర్ఘాంతపోయి, "బాగుంది! నే నొక్క ఘడియలో కచ్చేరీకి బయలుదేరి వస్తున్నాను. మీరంతా మీమీ పనులు చూసుకుంటూ ఉండండి!" అని అధికారితో చెప్పాడు. అధికారి కచ్చేరీకి వెళ్ళిపోయాడు.

అప్పుడు గుండప్ప తాపీగా కూచుని రాజుగారు తనకు చేసిన సూచనలను మననం చేసుకున్నాడు. అందులో మొదటిది ముఖం మాడ్చుకోవటం. ఇది ఎలాగో గుండప్పకు అర్థం కాలేదు. చివరకాయన ఇంత కాటుక తెప్పించి ముఖానికి పూసుకుని, కచేరీకి వెళ్ళాడు. ఆయన ఆచారం చూసి కచేరీలో అందరూ కంగారుపడ్డారు, కాని ఏమీ అనలేకపోయారు.

రాజు చేసిన రెండవ సూచన ఉద్యోగుల చెవులు కొరకటం. గుండప్ప ఉద్యోగస్తులలో ఒకణ్ణి దగ్గిరికి రమ్మని పిలిచాడు. వాడు వచ్చాడు. ఇంకా దగ్గిరికి రమ్మన్నాడు గుండప్ప. కొత్త అమల్దారు తనకేదో గొప్ప రహస్యం చెప్పబోతున్నాడని ఊహించి ఆ ఉద్యోగి తన చెవిని గుండప్ప నోటి దగ్గిరికి తెచ్చాడు.

వెంటనే గుండప్ప వాడి చెవి కసిక్కున కొరికాడు. వాడు బాధతో కేక పెట్టాడు.

ఇంకొక్క సూచన మిగిలి ఉన్నది. అందరి జుట్టూ తన చేతిలోకి రావాలి. ఇందుకోసం గుండప్ప వేచి ఉన్నాడు.

పొద్దు పోతున్నది. ఎంతకీ కొత్త అమల్దారు లేవకపోవటం చూసి మిగిలిన ఉద్యోగులు కూడా తమ స్థానాలలో కూచున్నారు. ఎంత ఆపుకోవాలని ప్రయత్నించినా, వారికి నిద్ర ముంచుకు వస్తున్నది.

చివరకు అర్ధరాత్రి అయింది. కచేరీలోని ఉద్యోగులు ఎవరిస్థానాలలో వారు నిద్రపోయారు. అదే సమయమని గుండప్ప తన స్థానంలో నుంచి లేచి, ఒక కత్తెర తీసుకుని చకచకా అందరి జుట్టూ కత్తిరించి తన చేత పట్టుకుని తన బసకు వెళ్ళిపోయాడు.

తాను రాజుగారి సూచనలను తూచా తప్పకుండా పాటించిన సంగతి రాజుగారికి విన్నవించి ఆయన మెప్పు పొందుదామని గుండప్ప మర్నాడు తెల్లవారుఝామునే బయలుదేరి వెళ్ళాడు.

గుండప్ప చెప్పినదంతా విని రాజుగారు తన చెవులను తానే నమ్మలేకపోయాడు. ఇంతలో దేవగిరి నుంచి ఒక ఉద్యోగి వచ్చి కొత్తఅమల్దారు ప్రవర్తన గురించి రాజుగారికి నివేదించుకున్నాడు. పూజా విధులు జరిపేవాణ్ణి, శాస్త్రజ్ఞానం కలవాడు కదా అని అభిమానం కొద్దీ, అధికారంతో కూడిన ఉన్నత బాధ్యతలుగల అమల్దారుగా పంపటం తనదే తప్పని గ్రహించి, రాజుగారు గుండప్పకు తిరిగి ఆ పని అప్పగించాడు.



శీతలవాయుమండలానికి వెనక చల్లటి పొడిగాలి, వెచ్చటి తడితో వున్న వాయువుతో ఢీకొన్నప్పుడు ఉధృతంగా మేఘాలు పైకి పుట్టుకువస్తాయి. మేఘాలలోని అల్పపీడనం మేఘాలను ఘనీభవింపజేయడంతో, వాటి మధ్య సొరంగాలవంటి బొరియలు ఏర్పడతాయి. ఇవి నేలను తాకేప్పుడు సుడులు తిరుగుతూ, భయానకమైన తుఫానులు వీస్తాయి.
1320 అడుగుల వెడల్పుతో గంటకు 300 మైళ్ళ వేగంతో తుఫాను గాలులు వీస్తాయి.
అమెరికాలోని మధ్య పశ్చిమ ప్రాంతంలో యేటా వసంతకాలంలో 150 పెనుతుఫానులు వీస్తాయి. 1965వ సం॥ వీచిన తుఫానులో 200 మంది మరణించారు. రష్యా, ఆఫ్రికా ప్రాంతాలు కూడా కొన్ని దెబ్బతిన్నాయి.






అమెరికాలోని ఉటా ఆర్చెస్ నేషనల్ పార్కులో వున్న శిలాతోరణమే ప్రపంచంలోకెల్లా చాలా పెద్దది. దీని పొడవు 291 అడుగులు. ఈ పార్కులో మరికొన్ని ప్రకృతి సిద్ధమైన శిలాతోరణాలూ వున్నాయి. ఇవన్నీ దాదాపు 15 కోట్ల సంవత్సరాలకు పూర్వం ఏర్పడినవే. ఇసుకబండలలోకి వాననీళ్ళు దిగి, వాటిని వ్యాకోచింపజేస్తాయి. గాలీ, మంచూ ఆ పగుళ్ళను క్రమంగా హరించడంవల్ల బొరియలు ఏర్పడి శిలా తోరణాలు ఏర్పడతాయి.
ఈ అరుగుదల కొనసాగడంవల్ల, మరి కొంత కాలానికి ఈ శిలాతోరణాలు పడిపోవచ్చు.

వనిత

1975
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

**వనిత**

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది?

**వనిత**

* మరి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

**వనిత**

1989
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదిహేనవ
సంవత్సరం....




కారణం

● విజ్ఞానానికి ● వికాసానికి ● వినోదానికి

**వనిత**

చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



K. S. Vijayaker



S. B. Takalkar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: క్రమశిక్షణకు నాంది! రెండవ ఫోటో: ఉత్తమ విద్యకు పునాది!

పంపినవారు: ఆర్. శ్రీజ్యోతి, ఏలూరు—534 001.

బహుమతి మొత్తం రు. 50/— నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.



The stories, articles and designs contained herein are exclusive property of the Publishers and copying or adapting them in any manner will be dealt with according to law.

'మేరీ' గోల్డు కవరింగ్ జ్యూయలరీ ఫ్యాషన్సులో అందెవేసిన చేయి. ప్రపంచంలోని స్త్రీలందరూ నాణ్యతకు - మన్నికకు వాడవలసినవి - ధరించవలసినవి - అలంకరించవలసినవి. కంటికింపగు యీ ఆభరణముల కొరకు నేడే మీ ఆర్డరును పంపించండి. వి.పి.పి. ద్వారా ఆభరణములను పొందండి డిజైను నంబర్లను మరియు ఉచితమైన కేటలాగులను ప్రత్యేకముగా అడుగుట మరిచిపోవద్దు.

DAD/MGC/06

No:660 Rs.100/50
No:665 Rs.100/50
No:668 Rs.150/50
No:673 Rs.150/50
No:675 Rs.150/50
Stone
No:680 Rs.200/50
No:541 Rs.350/50
No:474 Rs.375/50
No:534 Rs.275/50
No:444 Rs.200/50
No:443 Rs.200/50
No:434 Rs.200/50
No:438 Rs.200/50
No:551 Rs.300/50
No:728 Rs.125/50
No:699 Rs.150/50
No:380 Rs.300/50
No:388 Rs.150/50
No:598 Rs.100/50
Rs.100/50 No:395
No:433 Rs.200/50
No:727 Rs.125/50
No:311 Rs.100/50
No:303 Rs.100/50
No:615 Rs.100/50
No:647 Rs.100/50
No:742 Rs.150/50
No:584 Rs.80/50
No:305 Rs.100/50
No:735 Rs.200/50
No:723 Rs.125/50

MERI GOLD COVERING WORKS

P.O.BOX 1405, 14, RANGANATHAN STREET
T.NAGAR, MADRAS - 600 017, PHONE: 444671

ఆనందంగా ఆడేటప్పుడు,
వినోదంగా పాడేటప్పుడు...

## ఫన్‌బైట్ మటుకే మీ సంతోషానికి సంపూర్ణత కలిగిస్తుంది




క్యాంప్కో అందిస్తున్న ఫన్‌బైట్
సమృద్ధికరమైన క్రీమ్ చాక్లెట్.
కరకరలాడే వెఫర్ లోపల. రుచి
కరమైన చాక్లెట్ వెలుపల
వినోద సమయాలకి మరింత వినోదం
తెస్తుంది.

భారతదేశపు అతిపెద్ద అత్యాధునిక కర్మాగారం నుండి

క్యాంప్కో లిమిటెడ్, మంగళూరు.

Other Campco chocolates: Milk / White / TURBO / Eclairs / Playtime / TOFFEE
Campco beverages: WINNER

R K SWAMY/CL/7804/TEL

























Visesh/NC/8940/Tel